# బాలకృష్ణనాటకము
## యక్షగానము





మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము

పరిష్కర్త
ఆచార్య కె.జె. కృష్ణమూర్తి

Srinivas ttd

ప్రచురణ



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# బాలకృష్ణ నాటకము

## యక్షగానము

### మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము

సాధారణ సంపాదకుడు :

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకుడు, తి.తి.దే. "శ్వేత", తిరుపతి




పరిష్కర్త : ఆచార్య కె.జె. కృష్ణమూర్తి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్ట్

తి.తి.దే. "శ్వేత" తిరుపతి

ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2007**

BĀLA KṚṢṆA NĀṬAKAMU
(YAKṢAGĀNAMU)
MĀTṚŚRĪ TARIGOṆḌA VEṄGAMĀMBA

Edited by
**Prof. K.J. Krishnamoorthy**
Tarigoṇḍa Veṅgamāmba Vāṅmaya Project
"SVETA", T.T.D., TIRUPATI.

TTD "SVETA" Religious Publications Series No : 2


First Edition: 2007

Copies : 5000

Cover Design : **P. Srinivas**

Published by
**A.P.V.N. SARMA,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
TIRUPATI - 517 507

DTP & Printed at
**Sri Parasarya Press**
Sri Vyasasramam
Ph: 08578-287528

# ముందుమాట

కలియుగదైవంగా ప్రశస్తిగాంచిన వేంకటరమణుని భక్తపరంపరలో ఒక్కొక్కరిది ఒక విశిష్టత. ఈ విశిష్టత ఆ యా భక్తులు శ్రీవారిని ఆరాధించటంలో అవలంబించిన మార్గాలవల్ల మనకు వెల్లడవుతూవుంటుంది. 'శ్రీవేంకటాచల మాహాత్మ్యం' వంటి సరస కావ్యాలను స్వామికి సమర్పించి తరించిన తరిగొండ వెంగమాంబ ఆ దేవ దేవుని భక్తబృందంలో అగ్రగణ్యయైన కవయిత్రీశిరోమణి!

ఈ 'కవితాతపస్విని' తిరుమల క్షేత్రంలో తపోవనం లాంటి ఒక తులసీ బృందావనాన్ని నెలకొల్పింది. ఆ 'బృందావనం'లో రాజయోగసాధనతో పాటు, వాఙ్మయ తపస్సు కావిస్తూ శ్రీనివాసునకు అంకితంగా అనేక కృతులను వెలువరించింది.

ఈ మహాకవయిత్రి రచించిన పదునెనిమిది కృతుల్లో చాలా భాగం అముద్రితంగా, సాహితీపరులకు అందుబాటులో లేనివిగా అజ్ఞాతంగా ఉంటు న్నాయి. తిరుమలేశునికి మీదుకట్టి అవతరించిన ఈ రచనల నన్నిటిని ప్రచురించవలసిన ఆవశ్యకతను గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం ఈ కవయిత్రి పేరట ఒక గ్రంథ పరిష్కరణ ప్రాజెక్టును నెలకొల్పింది. ఈ ప్రాజెక్టు నిర్వహణ బాధ్యతలను తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులయిన శ్రీ 'భూమన్' గారికి అప్పగించింది.

ఉద్యమస్ఫూర్తి మేళవించిన ఉత్సాహపూరితులయిన "శ్వేత" సంచాలకులు శ్రీ 'భూమన్' గారు ఇటీవలే ఈ కవయిత్రి సారస్వతంపై ఒక జాతీయ సాహితీ సదస్సును విజయవంతంగా నిర్వహించటమే కాక, ఈ కవయిత్రి రచనల యందలి వేర్వేరు గీతాలకు ఆడియో సీ.డీ.లను తగిన గాయనీ గాయకులచే తయారు చేయిస్తుండటం మిగుల ముదావహమయిన విషయం.

హరికీర్తనాచార్యుడైన తాళ్లపాక అన్నమాచార్యుల జయంతి ఉత్సవాల లాగానే, ఈ కవయిత్రి యొక్క సాహితీ సమారాధనోత్సవాలను ఈమె జన్మదినమైన నృసింహుని జయంతి సందర్భంగా ప్రతి సంవత్సరం నిర్వహించడానికికూడా

తిరుమల తిరుపతి దేవస్థానం నిశ్చయించింది. ఇందులకు అనుగుణంగా మే 1వ తేదీన జరుపబోయే వెంగమాంబ జయంతి ఉత్సవ సందర్భంలో ఆవిష్కరించే నిమిత్తంగా ఈ క్రింది ప్రచురణలను చేపట్టి సిద్ధంచేస్తూవుండటం ఆహ్లాదదాయకంగా ఉంది.

1. తరిగొండ నృసింహశతకము

2. శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి (స్తుతి కావ్యము)

3. రమా పరిణయము (ద్విపద కావ్యము)

4. బాలకృష్ణ నాటకము (యక్షగానము)

5. చెంచు నాటకము (యక్షగానము)

6. భక్తిగీత సుధాలహరి (వెంగమాంబ యక్షగానాల్లోని 108 గేయాల సంకలనం)

7. అష్టాంగయోగ సారము (పద్యకావ్యము)

ఈ ప్రచురణలన్నీ సహృదయ సాహితీ లోకాన్ని అలరింపజేయగలవని ఆశిస్తున్నాను.

ఇలాగే ఈ భక్త కవయిత్రియొక్క రచనలన్నీ శ్రీనివాసుని దివ్యానుగ్రహ విశేషంచేత అచిరకాలంలోనే చక్కని పీఠికలతో గూడిన సుపరిష్కృత రూపాలతో వెలుగుచూడగలవని ఆకాంక్షిస్తున్నాను.

తిరుపతి — ఎ.పి.వి.ఎన్. శర్మ

28, మార్చి 2007 — శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు

తిరుమల తిరుపతి దేవస్థానములు.

# మనవి

తెలుగులో అన్నమయ్య తరువాత రాశిలోనూ, వాసిలోనూ విష్ణు సాహిత్యాన్ని విరివిగా అందించిన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. వెంగమాంబ 'తెలుగు మీరా'గా సుప్రసిద్ధురాలై, పోతనతో సాటియైన భక్తకవయిత్రిగా ప్రస్తుతింపబడింది.

శ్రీనివాసుణ్ణి రసరమ్యములైన కావ్యకుసుమాలతో పూజించి తరించిన సుమధుర సారస్వతమూర్తి తరిగొండ వెంగమాంబ. ఈ కవయిత్రి రచనలు శ్రీవేంకటేశ్వరుని సాహితీ మందిరంలో వెలిగించిన అఖండ దీపాలు. ఆ దీప కళికల కాంతులు ఈనాటికీ నిరంతరం ఆ తిరుమలేశుని దివ్య వైభవాన్ని అక్షరంగా ప్రకాశింపజేస్తున్నాయి.

తిరుపతికి పశ్చిమాన 100 కి.మీ. దూరంలో తరిగొండ గ్రామంలో ప్రభవించి, మధురకవితా సుధాధారలతో శ్రీ వేంకటేశుని అభిషేకించి తరించిన తెలుగు కవయిత్రి, అఖిలాంధ్ర జనయిత్రి తరిగొండ వెంగమాంబ.

సాంఘిక దురాచారాలపై సమరం ప్రకటించి, బాల వితంతువులపై ఆ నాడు జరిగే అన్యాయాలను ప్రతిఘటించి– తనకోసం కాదు– తనవంటి అభాగినులపై సంప్రదాయం పేరిట జరిగే అమానుష కృత్యాలను ఎదిరించి, తిరుగుబాటు బావుటా ఎగురవేసిన విప్లవవనిత వెంగమాంబ.

అనేకానేక ప్రక్రియలలో శతకాలు, యక్షగానాలు, ద్విపదలు, తత్త్వ సంబంధమయిన రచనలు, శ్రుతి, లయ సమన్వితములైన వేదాంతగీతాలు వెలయించటమేగాక, శ్రీ వేంకటాచలమాహాత్మ్యంవంటి బృహత్కావ్యములను రచించిన విదుషీమణి వెంగమాంబ.

శ్రీతరిగొండ వెంగమాంబ విశిష్ట వ్యక్తిత్వాన్ని పసిగట్టిన తిరుమల–తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి, గౌరవనీయులు, సంస్కారి శ్రీ ఏ.పి.వి.యన్.శర్మ గారు ఈ కవయిత్రి రచనలను పరిష్కరించి, ప్రచురించుటకుగాను

'తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు'ను ఏర్పరచి అందుకు పరిష్కర్తగా శ్రీ కె.జె.కృష్ణమూర్తిగారిని నియమించినారు. ఆ ప్రాజెక్టు "శ్వేత" ఆధ్వర్యంలో పనిచేసేట్టుగా ఆదేశించినారు. స్వయాన సాహితీప్రియుణ్ణి అయిన నాకు తరిగొండ వెంగమాంబను గురించి తెలుసుకునే అవకాశం ఈ రకంగా కలిగింది. వెంటనే ఆమె సాహిత్యంమీద రెండు రోజులు జాతీయ సాహితీసదస్సు నిర్వహించటం, అనంతరం పుస్తక ముద్రణతో పాటు, ఆమె పాటలకు బాణీలు కూర్పించి, ఆడియో సి.డి.లుగా విడుదల చేయటానికి పూనుకున్నాను. తిరుమల-తిరుపతి దేవస్థానముల చరిత్రలో మొట్టమొదటి సారిగా ఆమె జన్మదినం సందర్భంగా రెండు రోజులపాటు సంగీత, సాహిత్య కార్యక్రమాలు నిర్వహించతలపెట్టినాను. అతి త్వరలో అన్ని పుస్తకాల ముద్రణ, పాటల ఆడియో సి.డి.ల విడుదల పూర్తి చెయ్యాలనే పట్టుదలతో ఉన్నాము.

ఈ బృహత్ కార్యక్రమము సఫలీకృతం కావటానికి పూర్తి కారకులు శ్రీ ఏ.పి.వి.యన్.శర్మగారు; మా ప్రియతమ కార్యనిర్వహణాధికారి. వారికి తెలుగు సాహితీ, సంగీత ప్రియుల పక్షాన ధన్యవాదాలు.

*బి. యస్. రెడ్డి*
సంచాలకులు
**"శ్వేత"**

# పీఠిక

## 1. కథా సంగ్రహం:

శ్రీకృష్ణుడు బృందావనంలో ఆ యా కాలాల్లో, ఆ యా సన్నివేశాల్లో అనేక లీలలను ప్రదర్శిస్తూవుంటాడు. ఆ విధంగా శరదృతువునందలి ఒక వెన్నెల రాత్రిలో (కార్తీక పూర్ణిమనాడు) యమునా నదీతీరాన మనోహరంగా వేణుగానం కావిస్తూవుండగా, అచ్చటికి ఈశ్వరుడు (తలకోన సిద్ధేశ్వరుడు) నక్కజోగి వాని వేషాన్ని ధరించి కాకులను వేటాడటానికి వస్తాడు. 'కాకులు లేచిపోయేటట్లు నా వద్ద వేణునాదం చెయ్యవ'ద్దని కృష్ణుణ్ణి ఆక్షేపిస్తాడు. 'నీవెవడవురా?'- అని శ్రీకృష్ణుడు ప్రశ్నించగా, 'నీ వెవరో ముందుగా తెల్పరా!'- అని నక్కజోగి ఎదురు ప్రశ్న వేస్తాడు.

ఒకరి వృత్తాంతాన్ని మరొకరు తెలుసుకొన్న పిమ్మట శ్రీకృష్ణుడు విశ్వాసపూర్వకంగా నక్కజోగిని చూస్తాడు. అనంతరం నక్కజోగి తనదారిని తాను వెళ్తాడు.

ఆ పున్నమ రాత్రివేళ శ్రీకృష్ణుని వేణునాదంచేత ఆకర్షింపబడిన వారై వ్రేపల్లెలోని గోపాంగనలంతా పరుగు పరుగున అచ్చటకు వస్తారు. అలాగ వచ్చి, వాళ్లందరు భక్తితో బాలకృష్ణుణ్ణి స్తుతిస్తారు. శ్రీకృష్ణుడు వాళ్లను చూచి, 'ఆ రీతిగా ఇండ్లను వీడి రావడం తగ' దని, అందువల్ల నింద కలుగుతుందని, 'మీమీ పతులవద్దకు మరలిపొం'డని హెచ్చరిస్తాడు. అలాగ కొంతసేపు ఆ గోపికల మానసిక స్థైర్యాన్ని తన మాటలచే పరీక్షించి, పిదప వాళ్లందరినీ ఆదరించి, మధుర ప్రణయపూర్వకమైన సుఖాన్ని అనుగ్రహిస్తాడు. వాళ్ల మనస్సుల్లో అంకురించిన అహంభావాన్ని అణచేందుకై, శ్రీకృష్ణుడు నృత్యం చేస్తూ, ఉన్నట్టుండి అదృశ్యుడౌతాడు. గోపభామలు అందుకు ఎంతో చింతిస్తూ, ఆయనకొరకై అన్నివైపులా అన్వేషిస్తారు. వాళ్లందరి దీనాలాపాలను విని, కరుణించి హరి వారలకు ప్రసన్నుడౌతాడు. వారలను సంతోషింప

జేయడానికై యమునా తీరంలోని ఒక కమలసరోవరంలో వారితో కలిసి జలక్రీడ లాడుతుంటాడు.

ఇంతలో రాధాదేవి మేలుకాంచి, పన్నీటిలో జలకమాడి, సముచితము లయిన వస్త్రాలు, ఆభరణాలతో చక్కగా ముస్తాబై, చెలికత్తెలతో గూడి బృందావనానికి వేంచేస్తుంది. మామూలుగా ఉండే స్థలంలో శ్రీకృష్ణుడు లేనందువల్ల, రాధ చెట్లు, గుట్టలు, పక్షులు మొదలగు ప్రకృతిలోని పరివారాన్ని శ్రీకృష్ణుని జాడనుగూర్చి ఆప్యాయతతో అడుగుతుంది. నవ్వులాటకు ఎందైనా దాగివున్నాడేమో?– అని తలంచి, రాధ గోపాలుణ్ణి ఎలుగెత్తి పిలుస్తుంది. అప్పుడు 'మాయిక' అనే వికారస్వరూపిణి (శ్రీహరి యొక్క యోగమాయ– నక్కజోగి భార్య) తన భర్తయైన నక్కజోగిని వెదకుతూ అక్కడికి వస్తుంది.

రాధ, మాయిక ఒకరి వృత్తాంతాన్ని మరొకరు తెలిసికొంటారు. శ్రీకృష్ణుడు గోపస్త్రీలతోగూడి జలక్రీడ లాడుతూ వున్నట్లు మాయికవల్ల తెలిసికొన్న రాధ పరిపరివిధాల పరితాపపడుతుంది. మన్మథ, చంద్ర, మలయానిలాదులను దూషిస్తూ, తీవ్రమైన విరహవేదనకు ఓర్వజాలక మూర్ఛిల్లుతుంది. చెలుల శైత్యోపచారాలచే మూర్ఛనుండి తేరుకొన్న రాధ కృష్ణుణ్ణి పిలుచుకొని రావలసిందిగా మాయికను అభ్యర్థించి, పంపుతుంది.

మాయికవల్ల రాధాదేవి పరిస్థితిని తెలిసికొనిన మాధవుడు రాధ వద్దకు వస్తాడు. అప్పుడు రాధ శ్రీకృష్ణునియెడల బింకాన్ని ప్రదర్శిస్తుంది. ఇంతలో గోపికలంతా అచ్చటికి వస్తారు. రాధ వాళ్లతో కలహిస్తుంది. ఆ కలహంలో రాధకు మాయిక సాయంవస్తుంది. అందుచేత గోపయువతు లందరు కలిసి మాయికను పట్టుకొని ఒక చెట్టుకు కట్టివేసి, కొట్టుతూవుంటారు. రాధ వాళ్లందరినీ ధిక్కరించి, మాయికను విడిపిస్తుంది.

శ్రీకృష్ణుని పలుకులవల్ల గోపికలకు, రాధకు సయోధ్య ఏర్పడుతుంది. 'రాధిక ఒకనాడు, గోపిక ఒకనాడు వచ్చి బృందావనంలో శ్రీకృష్ణుణ్ణి కలియవలసినది'- అని మాయిక ఏర్పరచిన నియమానికి ఇరుపక్షాలవాళ్లు అంగీకరిస్తారు. లీలావినోదియైన శ్రీకృష్ణునికి దృష్టి తాకకుండా రాధాదేవి మంగళహారతి యివ్వటంతో ఈ యక్షగాననాటకం సుఖాంతంగా, మంగళాంతంగా ముగుస్తుంది. ఇది సంగ్రహంగా ఇందలి కథాస్వరూపం.

## 2. కవయిత్రి జీవిత రేఖలు:

తరిగొండ వెంగమాంబ ప్రాచీన కవయిత్రుల కోవలో చిట్టచివరి రచయిత్రి. ఈ కవయిత్రి పుట్టుకచే చరితార్థమైన గ్రామం తరిగొండ. ఇది చిత్తూరు జిల్లాలో తిరుపతి పుణ్యక్షేత్రానికి వాయవ్య దిశలో ఇంచుమించు 100 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ గ్రామం మహిమగల లక్ష్మీనృసింహ క్షేత్రంగా ప్రాచీనకాలంనుండి ప్రసిద్ధి గాంచింది.

అసలు "తరిగొండ"- అంటేనే 'నృసింహస్వామి' అని అర్థం. పూర్వం పెరుగు చిలికే కుండలో సాలగ్రామ శిలారూపంలో లక్ష్మీనృసింహుడు అవతరించినందువల్ల ఆ వూరిపేరు 'తరికుండ'గా వ్యవహరింపబడింది. సామాన్యజనుల ఉచ్చారణలో అది 'తరిగుండ'గా మారి, చివరకు "తరిగొండ" - అనే పేరు స్థిరపడింది. కనుక 'తరిగొండ'- అంటే 'పెరుగు చిలికే కుండలో వెలసిన నృసింహుడు'-అని అర్థం. తరిగొండ దేవాలయం కాణిపాకంలాగానే ఆ ప్రాంతంలో సత్యప్రమాణాలకు ప్రశస్తి గడించింది.

నందవర శాఖీయులు, వసిష్ఠగోత్రులు అయిన కానాల మంగమాంబ, కృష్ణయామాత్యుడు- ఈ కవయిత్రి తల్లిదండ్రులు. జననీ జనకులు సంతానార్థులై తిరుపతియాత్ర కావించిన అనంతరం జన్మించినందువల్ల- వేంకటేశ్వరుని వరప్రసాదంగా కూతురు కలిగిందని - వెంగమాంబ అనే

నామకరణం కావించారు. ఆమెకు చిన్ననాటినుండే దైవభక్తి సహజంగా అలవడింది. ఈ కవయిత్రి జననకాలం క్రీ.శ. 1730 ప్రాంతం.

వెంగమాంబ దైవభక్తి ధోరణి తొలుదొలుత తల్లిదండ్రులకు ఆనందం కలిగించినప్పటికీ, రానురాను వయస్సుకు మించిన భక్తిపరవశతతోను, తాత్త్వికమైన పరధ్యానతోను మైమరచిపోవడం, పాటలు పాడుతూ, వీధిలోసైతం నృత్యంచేసే స్థితి సాగుతూవున్నందువల్ల, ఇరుగుపొరుగువారు అది యొక ఉన్మాదస్థితియని ప్రచారం చెయ్యసాగారు. అందువల్ల, తల్లి దండ్రులు ఆమెకు బాల్యంలోనే-ఆమె వద్దంటూ వున్నప్పటికీ - బల వంతంగా వివాహం చేసినారు. వరుడు చిత్తూరుకు సమీపమందలి నారగుంటపాళెం వాస్తవ్యుడూ, శ్రీవత్సగోత్రుడూ అయిన తిమ్మయార్యుని కుమారుడైన వేంకటాచలపతి. వివాహమైన కొన్నాళ్లకు వరుడు విధివశాత్తు పరమపదించాడు. ఈ సంఘటన బాలికయైన వెంగమాంబలో నెలకొనివున్న వైరాగ్యభావాన్ని పెంపొందించింది.

ఆ కాలంలో మదనపల్లిలో రూపావతారం సుబ్రహ్మణ్యశాస్త్రులనే వేదాంతి, గొప్ప రాజయోగి ఉండేవారు. కృష్ణయామాత్యుడు కూతురి భవిష్యత్తు ప్రశాంతంగా సాగేందుకు అనువుగా ఆయనచేత బ్రహ్మవిద్యో పదేశం చేయించాడు. గురువుగారివల్ల అష్టాంగయోగ విధానాన్ని, మంత్రోప దేశాన్ని స్వీకరించిన వెంగమాంబ జన్మాంతర సుకృతంతోకూడిన తీవ్ర సాధనలచేత అచిరకాలంలోనే యోగవిద్యలో ఎంతో అనుభవాన్ని గడించి, గొప్పయోగిని కాగలిగింది!

వెంగమాంబ యథాప్రకారం ఒకనాటి మధ్యాహ్నవేళలో యోగా భ్యాసాన్ని విరమించి, అలసతతో ఆకాశంలోకి చూస్తూవుండగా, ఏవో కొన్ని అక్షరాల బంతులు ప్రకాశిస్తూ దిగివచ్చి, ఆమె ముఖంలో ప్రవేశించాయి!

ఈ దివ్యానుభూతిని ఈ భక్తకవయిత్రి తరువాతి కాలంలో తిరుమలక్షేత్రంలో రచించిన "శ్రీవేంకటాచలమాహాత్మ్యం" అనే పద్యకావ్యం యొక్క అవతారిక యందు ఇష్టదేవతాప్రార్థనలో రెండు పద్యాల్లో స్పష్టంగా పేర్కొన్నది.

నన్నయభట్టారకుడు మొదలుకొని నేటి దనుక విలసిల్లిన ఆంధ్రసార స్వతంలో ఏ యితర కవయిత్రి గాని, కవిగాని ఇలాంటి అపూర్వానుభవాన్ని- అక్షరాల రూపేణ శారద సాక్షాత్కరించిన సంగతిని- పేర్కొన్నవారు లేరు. అందువల్ల, ఇది ఈ భక్త కవయిత్రి జీవితంలోని అద్వితీయమైన అనుభవంగా పేర్కొనదగివుంది.

అప్పటినుండి గురువర్యుని ప్రోత్సాహంతో వెంగమాంబ గ్రంథరచన ద్వారా భగవంతుణ్ణి ఆరాధించడానికి ఉపక్రమించింది. చిన్నప్పుడు ఓనమాలు నేర్చుకున్నా, ఛందస్సు, అలంకారశాస్త్రం మున్నగు వాటిని అభ్యసింపక పోయినా, ప్రాచీనకావ్య, నాటకాదులను పఠింపకపోయినప్పటికీ వెంగమాంబ తరిగొండ లక్ష్మీనృసింహదత్తమైన కవితాకళా నైపుణ్యంతో- 1. తరిగొండ నృసింహశతకము 2. నృసింహవిలాసకథ (యక్షగానము) 3. శివనాటకము (యక్షగానము) 4. రాజయోగామృతసారము (ద్విపదకావ్యము) 5. బాలకృష్ణనాటకము (యక్షగానము)- అనే అయిదు కృతులను తరిగొండలో ఉండగా రచించింది.

సమాజం దృష్టిలో వితంతువైనా, 'భగవంతుడే నా పతి'అని సువాసినీ వేషంతో ఉంటూవున్నందువల్ల, పుష్పగిరిపీఠాధిపతి ఆ వూరికి వచ్చి, సభ చేయించి, వెంగమాంబను పిలిపించి ప్రశ్నించాడు. ఆమె తపశ్శక్తిని ప్రత్యక్షాను భూతంగా తెలిసికొని, ఆమె గొప్ప నృసింహోపాసకురాలని, ప్రహ్లాదాంశతో జన్మించిన కారణజన్మురాలని కొనియాడాడు. ఆ వూరి పూర్వాచార పరాయణులను మందలించి వెళ్లినాడు.

పుష్పగిరి స్వాములవారు వెళ్లిపోయిన నాటినుండి వెంగమాంబ తరిగొండ లక్ష్మీనృసింహుని ఆలయంలోనే ఉంటూ వచ్చింది. ఆ దేవాలయంలో ఉన్న ఆంజనేయుని విగ్రహం దాపున యోగంలో నిమగ్నయై ఉండగా, ఒకనాడు ఆలయార్చకుడు గమనించి, తలవెంట్రుకలుపట్టి ఇవతలికి లాగినాడు. అందువల్ల యోగం భగ్నమయింది. తనకు బాధ కలిగినా, వెంగమాంబ ఆతనిని ఏమీ అనకుండా, అచ్చటినుండి అడవిమార్గాన పయనించి, కొలది రోజులలో తిరుమలక్షేత్రాన్ని చేరుకొన్నది.

పిన్నప్రాయంలోనే తిరుమల చేరిన వెంగమాంబ గొప్పయోగినియని, దైవభక్తురాలని శిష్యులద్వారా తెలిసికొన్న ఆనాటి హథీరాంజీ మఠాధి పతియైన మహంతు ఆమెకు వసతి సౌకర్యాన్ని కల్పించాడు. అందువల్ల ఈ కవయిత్రి మరల గ్రంథరచనా కైంకర్యాన్ని ప్రారంభించింది.

వెంగమాంబ గొప్ప భక్తురాలని తెలిసికొన్న అన్నమాచార్య వంశీయులు తిరుమలలో ఉత్తరమాడ వీథిలో తమయింటిలో గల చిన్న భాగాన్ని ఆమెకు నివాసంగా ఇచ్చారు. ఈ కారణంచేత ఈ కవయిత్రికి సంకీర్తనాచార్యులైన తాళ్లపాకవంశకవుల రచనలను పఠించే చక్కని అవకాశం స్వామి సంకల్పంగా లభించింది! తాళ్లపాక అన్నమాచార్యులను "వరలబ్ధ మన్నమాచార్యునకు"- అని తన కావ్యంలో పూర్వకవిస్తుతిలో ప్రశంసించిన ఏకైక కవయిత్రి తరిగొండ వెంగమాంబ!

తిరుమలలో వెంగమాంబ నివాసానికి ఒక వైపున తాళ్లపాకవారు, ఇంకొక ప్రక్కన అక్కారాం వెంకటరామ దీక్షితులనే అర్చకుల పెద్ద నివసిస్తూ వుండేవారు. ఆయన నిష్కారణంగా ఆమెకు కొన్ని ఇబ్బందులు కలిగిస్తూ, మాటలతో మనస్సు నొప్పిస్తూవుండేవాడు. అందువల్ల ఆ యోగీశ్వరి అంతరాత్మప్రేరణచే తుంబురుకోన- అనే దట్టమైన అరణ్య ప్రదేశాన్ని

చేరుకొన్నది. అచ్చట నున్న ఒక కొండగుహలో దాదాపు ఆరేండ్లు తీవ్రంగా తపస్సాధన కావించింది.

మహంతు మొదలైన తిరుమలవాసుల అభ్యర్థనను అంగీకరించి వెంగమాంబ మరల తిరుమల చేరుకొన్నది. అనంతరం ఉత్తరమాడ వీథిలో ఎత్తైన ప్రదేశంలో ఒక పూలతోటను నెలకొల్పి, ఆ బృందావనంలో నిరంతరం మోక్షచింతన, రచనావ్యాసంగం కావిస్తూవుండేది. తిరుమల పుణ్యక్షేత్రంలో ఈ భక్తకవయిత్రి రచించిన రచన లీ క్రిందివి:

1. విష్ణుపారిజాతము (యక్షగానము) 2. రమాపరిణయము (ద్విపద కావ్యము) 3. చెంచునాటకము (యక్షగానము) 4. శ్రీవేంకటేశ్వర కృష్ణమంజరి (స్తుతి కావ్యము) 5. రుక్మిణీనాటకము (యక్షగానము) 6. గోపికానాటకము (గొల్ల కలాపము) (యక్షగానము) 7. శ్రీ భాగవతము (ద్విపద కావ్యము) 8. శ్రీవేంకటాచలమాహాత్మ్యము (పద్యకావ్యము) 9. అష్టాంగ యోగసారము (తాత్త్వికమగు పద్యకావ్యము) 10. జలక్రీడా విలాసము (యక్ష గానము) 11. తత్త్వకీర్తనలు 12. ముక్తికాంతా విలాసము (యక్షగానము) 13 వాసిష్ఠరామాయణము (ద్విపదకావ్యము). భక్తి వేదాంత భావ గర్భితాలైన ఈ రమణీయ రచనలవల్ల, శ్రీవేంకటేశ్వరస్వామివారికి ఈ కవితా తపస్విని కావించే కైంకర్యాలవల్ల ఈ భక్తకవయిత్రియొక్క మహానుభావత ఆ నాడు వెన్నెలవలె ఆంధ్రావనిలో అలముకొన్నది. తిరుమలలో తాళ్లపాక వంశీయుల ఇంటి ప్రక్కనున్న ఆమె నివాసం (మఠం) "అష్టఘంటములు"– అను పేరిటి ఎనిమిదిమంది తాళపత్ర లేఖకులతో నిత్యం సందడిగా ఉంటూ, ఆ కాలంలో దర్శనీయమైన సాహితీకేంద్రంగా ప్రకాశిస్తూ వుండింది.

వెంగమాంబ తిరుమలలో తాను రచించిన కృతుల నన్నింటిని ఇలవేల్పైన తరిగొండ లక్ష్మీనృసింహస్వామికీ, ఇష్టదైవమైన వేంకటేశ్వరునికీ

అభేదంగా అంకితం కావించింది. పైన పేర్కొన్న పదునెనిమిది కృతులేగాక, ఆ యా సందర్భాల్లో అశువుగా చెప్పిన పద్యాలు, శ్లోకాలు, పాటలు మొదలయిన వెన్నో! వాటిలో కొన్ని మాత్రమే ఈనాడు లభిస్తూవున్నాయి.

ఈ యోగీశ్వరి ప్రతి సంవత్సరం వైశాఖమాసంలో నృసింహజయంతి ఉత్సవాలను వైభవంగా నిర్వహిస్తూవుండేది. ఆ ఉత్సవాలలో జరిగే అన్నదానానికి ఆనాటి జమీందార్లు, పాళెగార్లు, ఆ యా గ్రామాల సామాన్య ప్రజానీకం వ్రాయించియిచ్చిన దానపత్రాలు (తాళపత్రాలు) వెంగమాంబ గారి విశిష్టవ్యక్తిత్వాన్ని, సమాజంలో ఆమె యెడల నెలకొనియుండిన భక్తి గౌరవాలను చక్కగా చాటుతూవున్నాయి.

క్రీ.శ. 1817 ఈశ్వర శ్రావణ శుద్ధ నవమినాడు ఈ కవయిత్రీ మతల్లి సజీవసమాధిద్వారా శ్రీనివాసునిలో ఐక్యమైనట్లు పరంపరగా వినవస్తున్న విషయం. ఈ మహనీయ సాహితీమూర్తియొక్క బృందావనం ఈనాటికీ తిరుమల పుణ్యక్షేత్రంలో దర్శనీయమై అలరారుతూవుంది.

### 3. తెలుగులో 'యక్షగానం' యొక్క పుట్టు పూర్వోత్తరాలు (సంగ్రహంగా):

తెలుగు సాహిత్యంలోని 'దేశి' (indigenous) రచనా ప్రక్రియలలో అత్యంత విశిష్టమైనది యక్షగాన ప్రక్రియ. అది యెంత విశిష్టమైనదో దాని పుట్టుక అంత విచిత్రమైనది. ఆదిలో అది దేవతారాధనకై ఉద్దేశింపబడిన ప్రత్యేక గానపద్ధతిగా ఆవిర్భవించింది. యక్షులయొక్క గానపద్ధతియే యక్షగానం.

యక్షులు గంధర్వ, విద్యాధరాదులలాగా దేవయోనులు.[1] అనగా దేవతలవల్ల జన్మించిన వాళ్లు (Demi gods). యక్షులకు రాజు కుబేరుడు.

---

1. విద్యాధరోఽప్సరో యక్ష రక్షో గంధర్వ కిన్నరాః ।
పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోఽమీ <u>దేవయోనయః</u> ॥
–అమరకోశము (గురుబాలప్రబోధిక) ప్రథమకాండము, స్వర్గవర్గము,11వ శ్లో.

అతడు 'ధనాధిపుడు'.[2] అంటే ధనానికి అధిపతి; అతడు 'ధనదుడు'[3] (ధనాన్ని ఇచ్చేవాడు) కూడ. సృష్టియందలి సమస్త సంపదలకు అధిదేవతయైన శ్రీమహాలక్ష్మి యక్షజాతి కంతటికీ కులదేవత.

యక్షులు 'యక్షరాత్రి' (దీపావళి) లాంటి ఉత్సవ సమయాల్లో లక్ష్మి, విష్ణువు - మొదలైన దేవతల మహిమలను ప్రత్యేకంగా గానంచేసేవారు. యక్షులు దేవయోనులే అయినా, మానవజాతికి సన్నిహితులే అన్న సత్యం ఈ సందర్భంలో మరువరానిది. యక్షుల రాజైన కుబేరుడు 'మనుష్య ధర్ముడు;[4] అతని వాహనంసైతం నరుడే![5] యక్షులకు మానవులతో గల సాన్నిహిత్యానికి ఇది చక్కని నిదర్శనం.

'యక్ష' జాతికి చెందిన కొందరు మిక్కిలి ప్రాచీనకాలంలో దక్షిణ హిందూదేశంలోనూ, సింహళద్వీపంలోనూ వ్యాపించి, తమ విచిత్రవేషాల చేత, విశిష్టమైన గానసరణిచేత ప్రజానీకాన్ని ఆకర్షించియుంటారని పరిశోధకులచే ఊహింపబడింది.

యక్షుల[6] ప్రత్యేకగాన పద్ధతి రాను రాను తదితరులచేతను అనుకరింపబడి, తరతరాల పెంపొందుతూవచ్చి, కాలక్రమేణ 'యక్షగాన'మనే పేరిటి సాహిత్య ప్రక్రియగా ఆవిర్భవించటానికి మూలకారణమై వెలసింది. ఈ క్రమ పరిణతినే ఈ క్రింది పౌరాణికగాథ భంగ్యంతరంగా వివరిస్తూవుంది:

---

2,3,4&5 మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః ।
కిన్నరేశో వైశ్రవణో పౌలస్త్యో నరవాహనః ॥
–అదే, 68&69 శ్లోకములు, వావిళ్లముద్రణ (1953).

6 'యక్ష' శబ్దమునకు 'యజ్ఞము, పూజ'– మున్నగు అర్థాలు కూడ ఉన్నాయి.
See: A Sanskrit-English Dictionary, Sir Monier Monier williams, page838, New edition -1951).
ఈ యర్థాలనుబట్టి "యక్షార్థమై (పూజార్థమై) యక్షులచే చేయబడే గానం యక్షగానం" –అని కూడా నిర్వచింపవచ్చు.

ఆంధ్రదేశంలో ప్రాచీనకాలనుండీ నెలకొనివున్న కులాల్లో జక్కుల వారు ఒకరు. వీళ్ల కులదేవత కామవల్లీ మహాలక్ష్మి. ఆమెకే ఆదిలక్ష్మీ కామేశ్వరి- అని మరొక పేరు. ఆ దేవతను ఆరాధించేందుకై పరమశివునిచే ఆజ్ఞాపించబడిన ఇద్దరు యక్షులయొక్క సంతతికి చెందినవారే జక్కులవాళ్లు. ఈ ఐతిహ్యాన్ని తెలియజేస్తున్న ద్విపదపంక్తు లివి:

"కామవల్లియు చిన్ని కన్యరూపమున
కామారి కప్పు డాకారంబు చూపె
చూపిన ముదమంది సురల రా బనిచి
యా పార్వతీశ్వరుం డతి సంభ్రమమున
ఇరవొప్ప యక్షుల నిద్దర బిలిచి
మురువొప్ప జక్కుల ముద్రలు చేసి
ఉరుమలు, మద్దెలల్, ఉపకరణములు
కరమొప్ప తగినవి గావించి యిచ్చి
ముత్యాల రంగముల్ మున్నూరు చేసి
అత్యంత ముదముతో నడిగిన వేళ
చిందెముల్ బోనముల్ శృంగారములును
అందముల్ పరికెలు ఆనందములును
ఆ రీతి సంతసమందగా జేసి
సారెకు ముద్రల జక్కుల బిలిచి
'రమణ మీ వంశపారంపర్యమెల్ల
కమలాక్షిఁ గొలువుడీ కామవల్లెమను
కామవల్లిని గొల్చు ఘనులెల్ల మున్నె
ప్రేమతో మిము చాల ప్రియము జేసెదరు

పొందని వీడ్కొల్ప పూబోణులందు
దండిగా వార లిద్దరు తోడురాగ
తేకువ కనకావతీపుర బపుడు
ఏకచిత్తంబున నేలుచునుండె"

-కామేశ్వరీ చరిత్రము, వ్రాతప్రతి, పుట 37,

R.No. 1945 (Paper), SVUORI. Library, Tirupati.

పై గాథను గ్రంథస్థం కావించిన కవి రేటూరి భావనామాత్యుడు[7] అంత ప్రాచీనుడు కాకపోయినప్పటికీ, ఆ కథ అంతకుముందు ఎంతో పూర్వకాలంనుండే ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉండిందని క్రీడాభిరామమనే కావ్యంలోని జక్కులపురంధ్రివర్ణన, అక్కలకొలుపు సన్నివేశం– మొదలైనవి చాటుతున్నాయి[8].

తెనుగుదేశంలోని జక్కుల కోవకు చెందినవాళ్లే కన్నడదేశపు 'ఎక్కల గాణలు'. వీరి ప్రసక్తి కర్ణాటసారస్వతంలో పెక్కుచోట్ల కనబడుతున్నది. వాటిలో అభినవ పంపడనే బిరుదు వహించిన నాగచంద్రుడనే కవి (క్రీ.శ. 12వ శతాబ్ది) రచించిన మల్లినాథ పురాణంలో కమలామోది యైన తుమ్మెద ఝుంకారం కమలాలయయైన లక్ష్మిని కీర్తిస్తూ పాడే 'ఎక్కల' గానంతో పోల్చి వర్ణించబడ్డ సన్నివేశం ప్రాచీనమైనది[9]. ఇందులోని ఉపమానాన్నిబట్టి కన్నడ దేశపు 'ఎక్కలగాణలు' తెలుగు దేశీయులగు 'జక్కుల' వారి వలెనే లక్ష్మీప్రశస్తిని గానంచేసే జానపదగాయకులని వెల్లడౌతున్నది.

'యక్షు'లనేవారు బౌద్ధయుగానికి పూర్వం సింహళదేశాన్నుండి

---

7. ఈ కవికాలం క్రీ.శ. 16వ శతాబ్ది. చూ. 'ఆంధ్రకవితరంగిణి', 11వ సంపుటం, పుట 134.

8. చూ. క్రీడాభిరామము 136–139 పద్యగద్యాలు. ఈ చారిత్రక కావ్యంలో వర్ణింపబడ్డ విషయాలు క్రీ.శ. 14వ శతాబ్ది ప్రారంభకాలానికి చెందినవి.

9. చూ. 'కన్నడ యక్షగానాలు' (వ్యాసం) శ్రీముట్నూరి సంగమేశం, భారతి – 1956, ఫిబ్రవరి సంచిక, పుట 67.

వెలువడి, క్రమంగా కర్ణాటాంధ్ర ప్రాంతాలలో విస్తరించిఉంటారనీ, పైన పేర్కొన్న జక్కులవాళ్లు, ఎక్కలగాణలు (ఎక్కడిగలు) ఆ యా ప్రాంతాల్లో స్థిరపడియుండిన ఆ యక్షుల సంతతియై ఉంటారనీ పరిశోధకులు అభిప్రాయపడినారు.[10]

జక్కులవాళ్ళు తమ ఇలవేల్పైన కామవల్లీమహాలక్ష్మియొక్క మాహాత్మ్యాన్ని ఉద్దేశించి పాడే పాటలు శ్రోతలలో భక్త్యావేశాన్ని రేకెత్తించే ప్రత్యేకఫణితిలో నృత్యసహితంగా ఆలాపింపబడుతుండేవి. అలాంటి ఉద్రేకజనకమైన బాణీ ఈనాడు కూడ కొన్నిచోట్ల మనకు గోచరిస్తుంది[11]. శివరాత్రి, నృసింహ జయంతి లాంటి పర్వదినాలలో శ్రీశైల, అహోబలాది పుణ్యక్షేత్రాల్లో జరిగే ఉత్సవాలలో, జాతరలలో జక్కులవారో, లేదా వాళ్లను అనుకరించే మరికొందరో యక్షుల విచిత్రవేషాలను ధరించి, ఆ యా దేవతల మహిమలను ప్రస్తుతించే గేయాలను పాడి ఆడినప్పుడు, ఆ 'యక్షవేషధారుల' ఆటపాటలు అక్కడ చేరివున్న అశేషప్రజానీకాన్ని అమితంగా అలరింప నారంభించాయి[12]. 'జక్కులపాటల,' చరిత్రలో దీన్ని తొలిదశగా భావించవచ్చు.

---

10. చూ. 'ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర' ప్రథమభాగము, పుటలు 13 మరియు 14, డా. యస్వీ జోగారావు, ఎమ్.ఏ., పిహెచ్.డి., ఆంధ్రవిశ్వకళాపరిషత్ ప్రకాశితము (1961).

11. చూ.కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి క్రీడాభిరామ పీఠిక, తృతీయముద్రణము, పుట 104.

12. "ఆదట గంధర్వ యక్షవిద్యాధరాదులై పాడెదు నాడెదువారు"

-పండితారాధ్య చరిత్ర (ప్రథమముద్రణము), పర్వతప్రకరణము, పుట 43.

ఈ ద్విపదకావ్యం క్రీ.శ. 13వ శతాబ్దికి చెందిన రచన. పైద్విపదపంక్తిలో పాల్కురికి సోమనాథమహాకవి సూచించిన యక్షుల వేషధారణ నేడు తెలుగు నాట కాలక్రమేణ అంతరించిపోయినప్పటికీ, కన్నడిగుల యక్షగాన ప్రదర్శనల్లో ఈ నాటికీ నిలిచివుంది. కన్నడదేశపు యక్షగానశాఖలలో యక్షగాన బడగతిట్టు బయలాట (North style of Yakshagana) అనేది మిగుల ప్రాచీనమైనది. మహాశివరాత్రి లాంటి పర్వదినాలలో శ్రీశైలానికి వచ్చి వెళ్లే కర్ణాటక యాత్రికుల ద్వారా తెలుగువాళ్లకు సుపరిచితమైనది. ఈ ప్రదర్శకుల వేషధారణలో ముఖ్యంగా పేర్కొనదగినవి వెడల్పాటి ఉష్ణీషాలు. ఇవి ప్రాచీనయక్షుల వేషధారణను సూచిస్తున్నాయి.

See: "Yakshagana A Dance Drama of India" Martha Bush Ashton & Bruce Christie, Abhinav publications, New Delhi (1977).

అటు తరువాత ఆ 'జక్కుల పాటల' బాణీలో మరికొన్ని పౌరాణిక గాథలు, క్షేత్రమాహాత్మ్యాలు అజ్ఞాత జానపదకవుల నోళ్లనుండి అవతరించి, విరివిగా ప్రచారాన్ని పొంది, పండితవర్గాన్ని సైతం ఆకర్షింపగలిగాయి. ఆ రీతిగా 'జక్కులపాటలు' విద్వత్కవుల దృష్టిని ఆకట్టుకోవడంవల్ల 'యక్షగానం' అనే సాంస్కృతిక నామధేయాన్ని సవదరించాయి[13]. ఈ తీరున 'జక్కులపాటలు' 'యక్షగాన'మనే నామధేయంతో శిష్టసాహితీమందిరంలో ప్రాణప్రతిష్ఠ పొందుతూవున్న (క్రీ.శ. 13,14 శతాబ్దుల నడుమ) కాలంలోనే ఈ పేరు అటు కన్నడనాడుకు) ప్రాకింది. ఇది యక్షగాన ప్రక్రియా వికాసంలో మలిదశ. ఈ దశ ఇంచుమించు క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధం వరకు విస్తరించిందని చెప్పవచ్చు.

13. "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున (గాంధారమున?) యక్షగానసరణి"
-భీమఖండము, 3వ ఆశ్వా, 65 ప.

'గంధర్వులు దక్షారామక్షేత్రం యొక్క కీర్తిని ('గాంధార' గ్రామంలో?) యక్షగానసరణిలో ప్రశంసిస్తూవుంటారని పై సీసపద్యపాదంయొక్క భావం.

శ్రీనాథమహాకవి భీమఖండ రచనాకాలం క్రీ.శ. 1430 ప్రాంతం.

చూ. కీ.శే. పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్రసాహిత్య చరిత్ర', పుట 349.

పై పద్యపాదంలో 'గాంధారమున' అనేదే సరియైన పాఠమని నేనూహిస్తున్నాను. గంధర్వులు కీర్తించేది గాంధర్వంలోనే (సంగీతంలోనే) కాబట్టి, మళ్లీ అలా చెప్పటంలో విశేషమేమీ లేదు. అలాకాక, కవిసార్వభౌముడు 'యక్షగాన' సరణినిగురించి పేర్కొంటూ, ఆ 'సరణి' గాంధారగ్రామానికి చెందినదని పై పద్యపాదం ద్వారా సూచించాడని భావించటం సమంజసం.

ఈ క్రింది ఆంగ్లవాక్యాలుకూడ పై ఊహను సమర్థించేవిగా ఉంటున్నాయి:

"He (K. Sivarama karanth) suggests that its earliest form was Gandharagrama which developed into Ekkalagana and finally evolved into a style known as Yakshagana"

-'Yakshagana a Dance Drama of India', page 20.

తెలుగులో యక్షగాన రచన క్రీ.శ. 14వ శతాబ్దినుండే కొనసాగినట్లు స్పష్టమైన నిదర్శనాలు ఉన్నప్పటికీ, ఆ రచనలు నేడు అలభ్యాలు[14]. అయితే, క్రీ.శ. 15వ శతాబ్దిలో రచింపబడ్డ ఒకటి, రెండు యక్షగానాల పేర్లు మాత్రం వినబడుతున్నాయి. ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన 'సౌభరిచరిత్రము' (జక్కుల కథ)- అలాంటివాటిలో ఒకటి. వెల్లంకి తాతంభట్టు 'కవిచింతామణి' – అనే లక్షణగ్రంథంలో ఉదాహరించిన 'లక్ష్మీకల్యాణము' ఇంకొకటి.

పోగా, క్రీశ. 16వ శతాబ్దినుండి రచింపబడిన యక్షగానాలు మనకు లభ్యమౌతున్నాయి. వాటిలో చక్రపురి రాఘవాచార్యుని విప్రనారాయణ చరిత్ర, కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయము, దినవహి ఓబయమంత్రి గరుడాచల విలాసము, బాలపాపాంబ అక్కమహాదేవిబోధోల్లాసము- మొదలైనవి

---

14. i) పదకవితాపితామహుడుగా ప్రశస్తిగాంచిన తాళ్లపాక అన్నమాచార్యులు (క్రీ.శ. 1408-1503) సంకీర్తనలక్షణం (సంస్కృతం)లో యక్షగానపదాలనుగూర్చి పేర్కొన్నివున్నట్లు ఆయన మనుమడైన చినతిరుమలాచార్యులు (క్రీ.శ. 1495-1553) తన తెనిగింపులోని ఈ క్రింది పద్యంలో తెల్పినాడు:

"తే.గీ. యక్షగాన పదంబులు నవ్విధమున
సముచితానేక విధతాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబు లగుచు
నలరునని హరికీర్తనాచార్యుఁడనియె"

–సంకీర్తన లక్షణము (తెనుఁగు), 66 ప.

చూ. 'తాళ్లపాకవారి లఘుకృతులు' తి.తి.దే. ప్రచురణ (1935), పుట 149.

పై పద్యాన్నిబట్టి అన్నమయ్య కాలానికి పూర్వమే- అనగా 14వ శతాబ్దిలో- తెలుగులో కొన్ని యక్షగానాలు రచింపబడివుండినట్లు ఊహించడానికి వీలౌతున్నది.

ii) "నాదృష్టిలో 14వ శతాబ్దమునకు చెందిన యక్షగాన మొకటి తాటాకులలో మూల్గు చున్నది."

–'యక్షగాన వాఙ్మయము' (1978), పుట7,
ఆచార్య బిరుదురాజు రామరాజు, ఎమ్.ఏ., పిహెచ్.డి,

ప్రాచీనతమాలు. అనంతరం ఆ ఒరవడిలో అనేక యక్షగాన రచనలు ఆంధ్రదేశంలో విరివిగా వెలువడ్డాయి. ఈ రీతిగా యక్షగానకృతులు ప్రజానీకానికి అందుబాటులోకి వచ్చిన దశను యక్షగానరచనాపరిణామ క్రమంలో మూడవ దశగా నిశ్చయింపవచ్చు. ఇది క్రీ.శ. 19వ శతాబ్దిదాకా కొనసాగింది. ఈ సుదీర్ఘదశలో యక్షగాన రచనపై, ప్రదర్శనపై ప్రభావాన్ని ప్రసరింపజేసిన ప్రముఖ ఘట్టాలు రెండు ఉన్నాయి. అందులో ఒకటి కూచిపూడి భాగవతుల పండిత పోషణ; రెండవది తంజావూరు, మధుర, మైసూరు రాజుల రాజపోషణ.

పై రెండు ఘట్టాలు కొంచెం వెనుక ముందుగా క్రీ.శ 17వ శతాబ్ది ఆరంభకాలంలో తటస్థించాయి. వాటిలో మొదటి ఘట్టం యక్షగాన ప్రక్రియకు అభినయ శాస్త్రానుగుణమైన గౌరవాన్ని ప్రసాదించింది. రెండవ ఘట్టం యక్షగానానికి సంస్కృత నాటకపు మెరుగులను హవణించింది. ఈ రెండు రీతుల ప్రభావం యక్షగాన ప్రక్రియావికాసంలో మరొక మలుపును సృజించింది. అప్పటి నుండే యక్షగానాలు 'పారిజాతములు'గా, 'భాగవతములు'గా, 'యక్షగాననాటకములు'గా, 'యక్షగాన ప్రబంధాలు'గా పలురకాల పేళ్లతో అసంఖ్యాకంగా వెలువడ్డాయి. 'యక్షగాన' వాఙ్మయశాఖ పరిపక్వ ఫలాలను ప్రసాదిస్తూ వుండిన ఈ కాలంలో (క్రీ.శ. 18-19 శతాబ్దుల నడుమ) ఎందరోయక్షగానకవులు, కవయిత్రులు విలసిల్లినారు. అట్టి కవయిత్రుల్లో అన్నివిధాలా అగ్రగణ్యయైన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. ఆ కవితా తపస్విని తరిగొండలో ఉండగా రచించిన అయిదు కృతులలో చివరిది 'బాలకృష్ణనాటక'మనే యక్షగానం.

## 4 బాలకృష్ణనాటక విశిష్టత:

### i) పేరు:

ఈ యక్షగానం వెంగమాంబ తరిగొండలో ఉండగా రచించిన కృతుల్లో ఐదవది, చివరిది. శ్రీకృష్ణుని బాల్యలీలలలో మిగుల విశిష్టమైనది 'రాసలీల'. ఈ 'రాసలీలా' కథాంశాన్ని ఆధారంగా పరిగ్రహించి, ఈ యక్ష గానాన్ని రచించినందువలన, వెంగమాంబ ఈ యక్షగానానికి 'బాలకృష్ణ నాటక' మనే పేరు పెట్టినట్లు భావించవచ్చు. కృత్యారంభంలోని ఈ క్రింది పద్యంలో కవయిత్రి దీని నామధేయాన్ని స్పష్టంగా పేర్కొన్నది:

తే.గీ. "ప్రకటముగ 'బాలకృష్ణనాటక'మనంగ
నొక్కకృతిఁ దగ యక్షగానోక్తిగాను
వెలయ రచియించె నింజేటి వెంగమాంబ
ఇమ్మహినిఁ దత్కథాక్రమం బెట్టిదనిన"

–3వ పద్యము

అయితే, ఈ నాటకాన్ని 'శ్రీకృష్ణనాటక'మని కూడా వ్యవహరింపవచ్చునని కవయిత్రి అభిప్రాయమైనట్లు గ్రంథాంతంలోని ఈ క్రింది ద్విపద పంక్తులను బట్టి తెలుస్తుంది:

"నరులెన్న 'శ్రీకృష్ణనాటకం'బనెడు
వరకృతి గావించి, వాసుదేవునకు
పరమభక్తిని సమర్పణముగాఁ జేసె"

### ii) కథకు ఆకరం:

ఈ నాటకంలోని కథకు ఆకరం రాసలీలాఘట్టం. ఈ ఘట్టం శ్రీమద్

భాగవతం (సంస్కృతం) దశమస్కంధం పూర్వార్ధంలో "రాస పంచాధ్యాయి" – అనే పేరిట 29వ అధ్యాయం మొదలుకొని 33వ అధ్యాయంవరకు గల అయిదు అధ్యాయాలలో 176 శ్లోకాల్లో విస్తరించివుంది. ఈ సన్నివేశం బమ్మెర పోతనామాత్యుని ఆంధ్ర మహాభాగవతంలో దశమస్కంధ పూర్వభాగంలో 150 గద్య పద్యాల్లో నెలకొనివుంది. వెంగమాంబ ఈ ఘట్టమందలి కథాంశాన్ని సంగ్రహీకరించి, దానికి రాధావృత్తాంతాన్ని స్వయంగా కల్పించి జతపరచింది. ఈ ముఖ్యకథకు సహాయకంగా నక్క జోగి దంపతుల వృత్తాంతాన్ని సృష్టించింది.

కవయిత్రి ఈ యక్షగానానికి కావలసిన కథాసూత్రాన్ని మాత్రమే భాగవతంనుండి స్వీకరించింది. అందులోని– గోపికాగీతలు, రాసక్రీడ, జలక్రీడ– అనే సన్నివేశాల వర్ణనలను నాటకీయతా దృక్పథంతో పరిహరించి, ఇందలి కథాసూత్రాన్ని స్వతంత్రంగా నిర్వహించింది.

**iii) నాటకీయత:**

యమునాతీరమే కథారంగంగా, శరత్పూర్ణిమారాత్రియే సమయంగా, పరిమితమైన కథావస్తువుతో సాగిన ఈ యక్షగానం దేశైక్యం (Unity of Place), కాలైక్యం(unity of Time), కథైక్యం(unity of Plot)– అనే 'ఐక్యత్రయం' తో విలసిల్లుతూ, నాటికలాగా రూపకధర్మసంశోభియై సాగింది. శ్రీకృష్ణుడు– గోపవనితలు, రాధ–మాయిక, రాధ–కృష్ణుడు, రాధ–గోపికలు– ఇల్లాగా ఆ యా పాత్రల జంటల నడుమ అనతి విస్తృతంగా నడచిన సంభాషణలు, గోపికలు, రాధ శ్రీకృష్ణుణ్ణి అన్వేషిస్తూ లతలను, చెట్లను, గుట్టలను, పిట్టలను ప్రశ్నించిన సంవాదకళావిలసిత సన్నివేశాలు–ఇత్యాదులు ఈ యక్షగానంలోని నాటకీయతా గుణవిశేషానికి నిర్మల నిదర్శనాలు.

ఈ నాటకంలోని త్రిపుట, జంపె, కురుచజంపె రేకులు, కంద

దరువులు, సీస దరువులు, సీసం, ఉత్పలమాల, కందం, తేటగీతి మొదలగు పద్యాలు- వీటన్నింటితో సముచితంగా ఇందులో సమకూడిన ఛందోవైవిధ్యం నాటకీయతాలక్షణాన్ని చక్కగా పరిపోషిస్తున్నది. ముఖ్యంగా కొన్ని దరువులకు రాగ, తాళములేగాక, ఆ తాళాలకు 'రెండవ కాలం', 'మూడవ కాలం' 'నాలుగవ కాలం'- ఇత్యాదిగా కాల నిర్దేశంకూడా చేయబడివుంది. ఈ సూచనలు ఈ యక్షగానం ప్రదర్శనకు ఉద్దేశింపబడిందనే అభిప్రాయాన్ని నిరూపిస్తున్నాయి.

**iv) పాత్ర చిత్రణ:**

ఈ యక్షగాననాటకంలోని పాత్రలు అయిదు. శ్రీకృష్ణుడు, రాధ, గోపికలు, నక్కజోగి దంపతులు. పాత్రల స్వభావచిత్రణలో వెంగమాంబకు గల నైపుణ్యానికి ప్రకృష్టమైన ఉదాహరణం రాధ. శ్రీకృష్ణుడు తనను విడిచి, గోపవనితలను లాలిస్తూవున్నాడని పరితపించడంలో రాధాదేవిలో స్త్రీ సహజమైన ఈర్ష్య సూచింపబడినప్పటికీ, అది తాత్కాలికం. కృష్ణుని యెడబాటును ఓర్వలేక మూర్ఛిల్లటంలో ఆమెయొక్క సుకుమార హృదయం వ్యక్తమౌతున్నది. తన వద్దకు వచ్చి బ్రతిమాలుతూవున్న కృష్ణుణ్ణి 'దొంగ' అని కోపంతో తిరస్కరించినప్పటికీ, తుదకు-

*జంపె*

"ముద్దు గోపాల! యీ-ముగ్ధలను గోరితివి
వద్దనిన విడుతువా? - వట్టి భ్రమ గాని
సామి! నీ మదికిఁ దోఁ - చని నీతులిఁకను లే
వేమిఁకను జెప్పుదును? - ఇభరాజవరద!
నీకు సమ్మతమైన - దే కార్యమైన మతి
నాకు సమ్మతిగాదె! - నళినాయతాక్ష!"

అని సమాధానపడటంలో రాధాదేవికి శ్రీకృష్ణునియెడల ఉండే ప్రణయ గౌరవభావం సుకుమారంగా ప్రకటితమయింది.

పిమ్మట, ఈ నాటకం చివర శ్రీకృష్ణుడు గోపికలను పిలిచి రాధకు అప్పగించటంలోను, అలాగే, గోపికలు సామరస్యంతో 'మా కంచితమైన యుక్తి నొక యాజ్ఞ నిరూపణచేయు రాధికా!'- అని అభ్యర్థించటంలోను ఆ పాత్రయొక్క పెద్దఱికం నిరూపిత మయ్యింది.

రాధ మాయికను పిలిచి 'మాకు నొక్క నియమంబుఁ జేయు'మని అడగటంలో రాధయొక్క గర్వరాహిత్యం, దృష్టి సోకకుండా శ్రీకృష్ణునికి మంగళహారతి ఇవ్వటంలో అనన్యభక్తిభావన- ఆవిష్కరింపబడ్డాయి. ఈ ప్రాముఖ్యాన్నిబట్టి పరికిస్తే 'రాధా పాత్రచిత్రణ'కొరకే ప్రధానంగా వెంగమాంబ ఈ యక్షగానాన్ని సృష్టించిందని స్ఫురిస్తుంది!

పాత్రల స్వభావాన్ని ఆవిష్కరింపజేయడంలోలాగే, వాటి స్వరూపాన్ని కనులకు కట్టేట్టు చిత్రించడంలోనూ ఈ కవయిత్రి సిద్ధహస్తురాలు. ఈ విషయంలో 'మాయిక' స్వరూపవర్ణనం ఒక మచ్చు తునక. (చూ. పుట.36).

నిశితంగా పరిశీలించి చూస్తే, శ్రీకృష్ణుడు, రాధ-లాంటి పౌరాణిక పాత్రలను చిత్రించడం ఒక యెత్తు; సమాజజీవనంలో అట్టడుగున అతి నికృష్ణమైన వేషంతో మసలుకొనే మాయికలాంటి పాత్రలను సహజత్వం ఉట్టిపడే లాగున చిత్రించడం ఒక యెత్తు. తరిగొండ వెంగమాంబ తాను రచించిన ప్రతి యక్షగానంలోనూ ప్రసిద్ధపౌరాణిక పాత్రలను సింగీ, సింగళ్ల రూపాల్లోనో, మరో విధంగానో, (మాయిక- నక్కజోగిలాంటి) మారు వేషాలతో సహాయక పాత్రలుగా ప్రవేశపెట్టి, నాటకాన్ని చైతన్యవంతంగా రంజింపచేయడంలో అందెవేసిన చేయి!

V శైలి :

ఈ యక్షగాన రచనాశైలి కథానుగుణమై చెవి కింపుగా నినదిస్తూ వుంది. ఇందుకు ఈ నాటకం ఆద్యంతం ఉదాహరణీయమే ఐనా, గోప కాంతలు బృందావనంలో శ్రీకృష్ణుణ్ణి స్తుతించిన ఘట్టమందలి దరువులు మచ్చుకుగా తిలకింపదగివున్నాయి. (చూ. పుటలు 10&11).

ఈ యక్షగానంలోని పద్యాలు కొన్ని పోతన భాగవతంలోని, మొల్ల రామాయణంలోని పద్యాలకు అనుసరణలుగా జాలువారి ఉన్నాయి. ఈ విషయమై ఈ క్రింది పద్యం ఒక ఉదాహరణ:

**"నవ్వుముఖంబువాఁడు, మృదునాదసువేణువుఁ బూనినాఁడు వా**
**డివ్వసుధావధూరమణుఁ, డిందిరకున్ ప్రియుఁడైనవాఁడు, మా**
**యవ్వనమూల్య మిప్పు డతఁ డంతయు ముచ్చిలి తెచ్చినాఁడు బల్**
**రవ్వలు జేసినాఁ డిటకు రాఁడు గదా? గిరులార! చెప్పరే!"** 51-వ పద్యము.

పై పద్యం పోతనామాత్యుని భాగవత దశమస్కంధంలోని పద్యరత్నాల్లో ప్రసిద్ధమయిన "నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు" X -1010 ప. అనే పద్యానికి సార్థకమైన అనుసరణ అని అందులోని శైలి చెప్పక చెపుతున్నది.

ఇలాగే, రాధాదేవి మాయికకు శ్రీకృష్ణుని స్వరూపాన్ని వివరించే సందర్భంలోని "నీలనీరదమును బోలు దేహమువాఁడు, రమణీయహేమాం బరంబువాఁడు"- ఇత్యాది సీసపద్యం మొల్ల రామాయణంలోని "నీలమేఘ ఛ్ఛాయఁబోలు దేహమువాఁడు, ధవళాబ్జపత్ర నేత్రములవాఁడు" (సుందరకాండ, 102వ పద్యం) అనే పద్యానికి చక్కని అనుసరణ అని స్పష్టమౌతుంది. ఈ విధంగా ఈ యక్షగాన శైలి శృంగారరస పరిపోషకమై, శ్రావ్యమైన సంస్కృతాంధ్ర పదసమ్మేళనంచేత సరళ సుందరంగా ప్రకాశిస్తూవుంది.

## 5 పరిష్కరణ:

### i. వ్రాతప్రతులు :

ఈ యక్షగాన పరిష్కరణకు ఆధారమైన వ్రాతప్రతులు రెండు. ఇవి రెండూ తాళపత్ర ప్రతులే. ఇందులో మొదటిది వాయల్పాడుకు సమీపంలో ఉన్న చిన్నతిప్ప సముద్రం (సి.టి.యం) గ్రామ వాస్తవ్యులైన శ్రీడాకరాజు వేంకటరమణప్పగారి యింటిలో లభించింది. డాకరాజువారు తరిగొండ వెంగమాంబ తండ్రిగారి వంశీయులకు బంధువర్గంలోనివారు. ఈ తాళపత్ర ప్రతి 21 తాళపత్రాలు గల సమగ్రపతి. అచ్చటచ్చట కొద్దిగా శైథిల్యం ఉన్నప్పటికీ, ఈ గ్రంథంయొక్క సమగ్రస్వరూప అవగాహనకు ఇబ్బంది కలుగ లేదు. ఇందలి వ్రాత సన్నని అక్షరాలలో సాగింది. ప్రతి చివర 21వ తాటాకులో వ్రాయసకాని వక్కణ ఈ క్రింది విధంగా లిఖింపబడివుంది:

"వికారి నామ సంవత్సర జ్యేష్ఠ శు.౧౩లు (త్రయోదశి) వరకు బాలకృష్ణ నాటకం సంపూర్ణ్ణం॥ చీనేపల్లి పెద్దన్న కొమారుడు చంద్రప్ప వ్రాశిన బాలకృష్ణనాటకం. యీ ప్రతి తప్పులు వ్రాశివుండలేదు. శుద్ధప్రతీ."

పైన పేర్కొన్న లేఖన కాలాన్ని బట్టి ఈ తాళపత్రప్రతి క్రీ.శ. 1779 మే నెలలో వ్రాయబడిందని స్వామికణ్ణుపిళ్లై రచించిన Indian Ephemeris నుబట్టి నిశ్చయింపవీలౌతున్నది. ప్రకృత పరిష్కరణలో ఈ ప్రతి ప్రధానప్రతిగా స్వీకరింపబడింది. దీనికి "అ" అనే సంకేతం ఉంచబడింది.

రెండవ తాళపత్రప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంథాలయం లోనిది. ఆ ప్రతిసంఖ్య నెం. 1566/1281/2 (PL). అందులో 36 తాళపత్రా లున్నాయి. వ్రాత లావుపాటి అక్షరాల్లో విడివిడిగా, పంక్తులు దూరదూరంగా వ్రాయబడివున్నాయి. వ్రాతలో తప్పులు చాలా ఉన్నప్పటికీ, ప్రధాన ప్రతిలో

శిథిలమైన భాగాలకు సంబంధించిన పాఠాలు కొన్ని అందులో లభించాయి. ఈ ప్రతిలో చివరి రెండు పత్రాలు లేనందువల్ల లేఖనకాలం, వ్రాయసకాడు-మొదలయిన వివరాలు తెలియరాలేదు. ఈ కాకినాడ ప్రతికి "క" అనే సంకేతం ఉంచబడింది.

**ii) సవరణలు:**

ఈ వ్రాతప్రతుల్లో సాధారణంగా గోచరించే ప్రాచీన లేఖన సంప్రదాయానికి చెందిన వలపల గిలక, నిండుసున్నకు తరువాతి హల్లు ద్విత్వాన్ని పొందివుండటం (తరిగొండ్డ, తలకోన వంక్క మొదలగు వానివలె), క్రిష్ణ, నరశింహ్వా-మొదలైన లేఖన రీతులు నేటి వ్రాతపద్ధతులకు అనుగుణంగా సవరింపబడ్డాయి.

అలాగే, లేఖకుని భ్రాంతి, ఏమరుపాటు, అజ్ఞత-మొదలైన కారణాల వల్ల వ్రాతలో చోటుచేసికొన్న పలురకాల లేఖన దోషాలను సముచిత రీతిలో సవరించడం జరిగింది.

ఈ యక్షగాన స్వరూపం (Text) లో ఎక్కువగా దరువులలాంటి గేయాలు, అక్కడక్కడ సందర్భానుగుణంగా ద్విపద, తేటగీతి, కందం, సీసం, ఉత్పలమాల లాంటి వృత్తాలు నెలకొనివుండి ఒకే లేఖినినుండి వెలువడినప్పటికీ పద్యాల్లో ప్రయుక్తమైన భాష గేయాల్లోని భాషకన్నా యతి, గణ, ప్రాసాది ఛందోనియమాలకు, మఱికొన్ని భాషానియమాలకు ఒదిగి వుండటంవల్ల ఆ రెండిటి భాషాస్వరూపంలో కొద్దిపాటి తేడా గోచరిస్తుండటం సహజమే. కవయిత్రి ప్రయోగించిన భాషకు సంబంధించిన ఈ స్వభావాన్ని దృష్టిలో ఉంచుకొని ఇందులో పరిష్కరణ కార్యం (లక్షణానుసరణం) మెలకువతో నిర్వహింపబడింది.

ఇక, ఇందులోని దరువులు, ఏలలు-మొదలైన పలు రకాల గేయాలు చాలవరకు దీర్ఘాక్షరాలతో, తీగె సాగిన తీరులో లిఖింపబడివున్నాయి. కొన్ని చోట్ల అనావశ్యకములైన దీర్ఘాలచేత అర్థస్ఫూర్తి క్లిష్టమై ఉంది. అందుచేత అలాంటి దీర్ఘాలు-అర్థావగతికి అనుకూలించేంత మేర - ఆ యా గేయాల యొక్క నడకకు అనుగుణంగానే సవరింపబడినాయి. మొత్తంమీద ఇలాంటి స్వల్ప సవరణలు ఈ సహజ కవయిత్రి ప్రయోగించిన వ్యావహారిక భాషా స్వరూప పరిధిని అతిక్రమింపకుండా కడు జాగ్రత్తతోనే కావింపబడ్డాయి.

ముఖ్యంగా ఇందులో ప్రయుక్తమైన వ్యావహారిక భాషాస్వరూపం పలురీతుల వైవిధ్యంతో విలసిల్లుతూ వున్నందువలన, దాని స్వరూపా వగాహనకు ఆటంకం కలుగని రీతిలో ఈ పరిష్కరణ కార్యం

**iii) వివరణలు:**

"అ" ప్రతి (ప్రధానప్రతి) లోకన్నా భిన్నమైన పాఠం "క" ప్రతి (కాకినాడ ప్రతి)లో లభించిన చోటుల్లో అటువంటి పాఠాంతరాన్ని అధోజ్ఞాపిక (foot-notes) లో నిర్దేశించి చూపడం జరిగింది. అలాంటి పాఠభేదాలనే కాక, ఆవశ్యకత ననుసరించి మరికొన్ని విశేషాంశాలనుకూడ అధోజ్ఞాపికల్లో వివరించడం జరిగింది.

వ్రాతప్రతిలో సకృత్తుగా కొన్ని చోట్ల నాటక గమనానికి అనుకూలించే చిన్న చిన్న 'సంధివచనములు' లోపించివున్నాయి. అర్థదృష్టితో పరిష్కర్త సమకూర్చిన అలాంటి సంధివచనాలు కుండలీకరణాల్లో చూపించబడ్డాయి.

అనంతరం పేర్కొనవలసినవి విరామచిహ్నాలు. తాళపత్రలేఖనంలో నిలువుగీతయే సాధారణంగా విరామచిహ్నంగా ఉంటుంది. ప్రకృత

పరిష్కరణలో కామా, సెమికోలను, తలక్రిందుకామాలు, అడ్డగీత (hyphen), ప్రశ్నార్థక, ఆశ్చర్యార్థకాదులు ఇందులో అవసరమైన చోటుల్లో గుర్తింపబడివున్నాయి. ముఖ్యంగా ఇది నాటకం కాబట్టి "అనియె, పలికె"– ఇత్యాది క్రియలు వాటిల్లిన స్థలాల్లో సామాన్యంగా 'కోలను' తరచుగా వాడబడింది.

ఇలాగే 'ఇష్టదేవతా ప్రార్థన' లాంటి ఉపశీర్షికలు (Sub headings) ఈ రచనాస్వరూపంయొక్క అవగాహన నిమిత్తం పరిష్కర్తచే ఎడనెడ సముచితంగా సమకూర్చబడివున్నాయి.

తి.తి.దే. "శ్వేత" సంస్థ పక్షాన ప్రచురితమౌతున్న ఈ మధుర కవితా కృతి సహృదయ రసజ్ఞులకు ఆహ్లాదదాయి కాగలదని ఆశయము.



# కృతజ్ఞతలు

తిరుపతి ఉత్సవాల్లో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ సారస్వతాన్నిగూర్చి ఉపన్యసించే సదవకాశాన్ని కల్పించటం ద్వారా ఈ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు మూలవిరాట్టుగా అంకురార్పణ కావించిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీ భూమన కరుణాకరరెడ్డి మహోదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యులెల్లరకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టు రూపొందటంలో మూలకారణులయిన సహృదయవతంసులు తిరుమల తిరుపతి దేవస్థాన శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, సుగృహీతనామధేయులు శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ, ఐ.ఏ.యస్., మహోదయులకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

తిరుమలలో సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ జి. బలరామయ్య, ఐ.ఏ.యస్.,గారు, తిరుపతిలో సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీఎన్.శ్రీకాంత్, ఐ.ఏ.యస్.,గారు– ఈ ఉన్నతాధికారు లిరువురకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ ఉద్యమస్ఫూర్తిని ప్రసాదించి, ఉత్సాహ, ప్రభుశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూవున్న తి.తి.దే. "శ్వేత" సంస్థ సంచాలకులు, సహృదయవతంసులు, "భూమన్"గా సుగృహీత నామధేయులయిన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్యంరెడ్డి మహోదయులకు నా అనేక హార్దిక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు సరసహృదయులు శ్రీయుతులు కె.రామ్‌పుల్లారెడ్డిగారికి నా అనేక హార్దిక కృతజ్ఞతాభివాదములు.

టి.టి.డి. "శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతిగారికి, వారి సహాయోద్యోగులయిన మిత్రబృంద మందరికీ-

"శ్వేత" సంస్థ కార్యాలయం సూపరిండెంటెంట్ శ్రీ వి. దామోదరం గారికి, వారి సహోద్యోగిబృందమందరికీ, మిత్రుడు శ్రీ జి. సురేష్‌కుమార్ (యు.డి.సి) గారికి-

"శ్వేత" సంస్థ కో-ఆర్డినేటర్స్ శ్రీ పి. రమణారెడ్డిగారికి, మిత్రుడు డా॥ యన్.యస్. బాలాజీరావుగారికి, తదితర మిత్రులందరకూ-

నా అనేక హార్దిక కృతజ్ఞతాభినందనములు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థ డైరెక్టర్ ఆచార్య వి. వేంకటరమణారెడ్డిగారికి, వారి సహోద్యోగులకు అనేక హార్దిక కృతజ్ఞతాభి నందనములు.

ఈ పుస్తకమును ముచ్చటగా ముద్రించిన శ్రీవ్యాసాశ్రమము (ఏర్పేడు) శ్రీపారాశర్య ముద్రణాలయము వారికి నా హార్దిక కృతజ్ఞతాభినందనములు.

మాతృశ్రీ తరిగొండవెంగమాంబాకవయిత్రియొక్క ఆరాధ్య దైవమయిన "శ్రీతరిగొండ శేషకుధరాధ్యక్షు"నకు నా భక్తిపూర్వక ప్రణామాంజలి.

--కె.జె. కృష్ణమూర్తి

# బాలకృష్ణ నాటకము
## యక్షగానము
### విషయ సూచిక

# బాలకృష్ణ నాటకము

## యక్షగానము

### ✳ ఇష్టదేవతా స్తుతి ✳

ఉ. శ్రీ గిరిజాత్మసంభవునిఁ,
జిత్తజ సామజరాజకేసరిన్,
భోగిశయానునిన్, విమల
పుణ్యచరిత్రునిఁ బద్మసంభవున్,
యోగివరేణ్యులన్, సురల,
నుత్తమమౌని, కవీంద్రులన్, సమ
స్తాగమవేత్తలం గొలుతు
నంచితమై తగు భక్తియుక్తులన్.

క. తరిగొండ నృసింహుల ఘన
వరమును, దుర్గాంబకృపను, భైరవు కరుణన్
సిరిని, సరస్వతిని మదిం
దిరముగ భావించి నిల్పి, తెలివి దలిర్పన్. 2

తే.గీ. ప్రకటముగ బాలకృష్ణ నాటకమనంగ
నొక్క కృతిఁ దగ యక్షగానోక్తిగాను
వెలయ రచియించె నింజేటి వెంగమాంబ
ఇమ్మహిఁ దత్కథాక్రమం బెట్టిదనిన. 3

### ✳ కథా క్రమము ✳

సీ. శ్రీదేవకీగర్భ సింధు శశాంకుఁడై
యాది మహావిష్ణుఁ డవతరించి

నందుని నగర నానందంబుతో నుండి
గోపార్భకులతోడఁ గూడియాడి,
కపటాసురులఁ బట్టి క్రమముగా ఖండించి,
యనఘాత్ములగువారి నాదరించి,
నవనీతచోరుఁడై, నళినాయతాక్షుల
వస్త్రాపహారియై, వయసువగల

తే.గీ. మొనసి, కాంతల కత్యంత మోహచిహ్న
ములను బుట్టించి, తా నందు మోహరహితుఁ
డగుచు యోగామృతధ్యానమందు నిలిచి
వెలుఁగుచుండెను గోపాలవేషధారి. 4

## ✳ నక్కజోగి రాక ✳

క. ఆ వనజాక్షునిఁ గనుఁగొనఁ
గా వేడ్కను నక్కజోగి ఘనతరలీలన్
పావన బృందావనమున
జీవనముగఁ గాకివేఁట [1]చేసెదనంచున్. 5

ద్విపద. నెళవుగాఁ బైగుంట–నీళ్లు పోసికొని
కులుకుగా నొకతోలు–గోఁచి పెట్టుకొని
తలవెంద్రుకలు పేఁడి, – తగఁ గొండెఁ గట్టి
[2]బలముగా నొక మసి–బట్టఁ గప్పుకొని
పదిమాసికల బొంత–పైనఁ గప్పుకొని
గుదియ చేఁబట్టి, యె–క్కువయైన యట్టి

1. చేయుచునుండెన్ – క 2. బలిమిగా – క

బూటకంబుగఁ దల-పుట్టెలు గూర్చి
మేటిగా నొకదండ-మెడను వేసికొని
మిడిగ్రుడ్లఁ బలుమాఱు-[3]మిన్నుఁ జూచుచును
కడు వికారముల కా-కరమైన మూఁడు
వల లొడ్డి, జీవన-వాంఛ రెట్టింపఁ
దలకోన వంకలోఁ-దా డాఁగి డాఁగి
వెరవొప్పఁ గాకుల-వెనువెంట నంటి
తఱుముచు..............................

## దరువు - ఆది తాళం

నక్కజోగివాఁడు వచ్చె - బిక్కరింపుచూ ॥పల్లవి॥
రెండు, దిక్కూలఁ బొయ్యే కాకుల-వెక్కిరింపుచూ
॥నక్కజోగివాఁడు॥ ఉపపల్లవి॥
కుక్కాల నుసికొల్పి - వింత కొంతా జూపుచూ
....................గాంచి - నవ్వూకొనుచూ ॥నక్కజోగి॥ ౧
ఆలోనె కోఁతులఁబట్టి - యాట్లాడింపుచూ
మూఁడు, మూలాల గవిలోని - ముసలి ముదితా నరయుచూ
॥నక్కజోగి॥ ౨

దేశమూలు తిరిగి తిరిగి - తిరిపె మెత్తుచూ ॥నక్కజోగి॥ ౩

3. మిఱ్ఱిచూచుచును-క

క. ఇటువలె వచ్చి ముదంబునఁ
గుటిలక్రియ లొప్పఁజూపి, గురుతరయమునా
తటినీ తీరమునందును
నటియించెను నక్కజోగి నానాగతులన్. 6

## ✳ బృందావనము ✳

ద్విపద. అటువంటి వేళఁ జి-దానందమూర్తి
విటుని చందంబున-వెన్నెల బయట
నలువంద బృందావ-నంబులోఁ జేరె,
నిలను బృందావనం-బెటువంటి దనిన:
చందన జంబీర-సహకార తిలక
మందార ఖర్జూర-మన్మథ క్రముక
తాల తక్కోల హిం-తాల తమాల
సాల రసాల కాం-చన బిల్వ వకుళ
కుటజ కురంటక-కురవక కుంద
వట మాతులుంగ ల-వంగ పున్నాగ
భల్లాతక మధూక-బదరికాశ్వత్థ
మల్లికా వల్లికా-మాధవీ సిందు
వార మతల్లికా-వంజుల సరళ
నారికేళాశోక-నాగ కదంబ
కరవీర పిచుమంద-కదళీ పలాశ
మరువక మోఘాది-మహిత భూజములు
పూచి కాచి ఫలించి-పూర్ణమైయున్న

ఖేచరవీథిఁ గ్రి-క్కిరిసి యేతెంచి
ఫలములు తృప్తిగా-భక్షించి, చాలఁ
బొలుపొంద ఖగగణం-బులు వేడ్క నుండు;
మద బంభరంబులు-మకరంద పాన
మదనుగాఁ జేసి యం- దాడుచునుండు.
'నందనవనమైన - నా సరి గాదు
సందేహ' మేమని-జనుల కందటికిఁ
దెలుపుచు యమునా న-దీ తీరభూమి
నలరు బృందావన,-మందుండి సామ
వేదగానోక్తుల-వేణువుఁ బూని
నాదంబుఁ జేసె శ్రీ-నారాయణుండు.

## ✳ వేణు నాదము ✳

### దరువు - ఆది తాళం

వింతవింత లాయె శౌరి-వేణునాదమూ ॥పల్లవి॥
నిరత, మంతరాత్మ నరసేవారి-కైన నాదమూ॥వింత వింత॥ఉ.ప॥
త్రిజగన్మోహనమైనట్టి-దివ్యనాదమూ
మేటి, భుజగకాంత తుదను మ్రోసే-బోధ నాదమూ ॥వింత॥ ౧
సుజనులాకు ముక్తి [4]పదముఁ- జూపే నాదమూ
మునులు, విజన దేశమందు నిలిచి-విన్న నాదమూ ॥వింత॥ ౨
చెనఁటి దురితములకు భయముఁ-జేసే నాదమూ
మదిలోఁ, బనుపడిన విక్షేపములను-బాపే నాదమూ ॥వింత॥ 3
వీనులాకుఁ జల్లనైన-విమల నాదమూ
సకల, గానవిద్య కెల్లఁ దల-కట్టు నాదమూ ॥వింత॥ ౪

4. పథము - క

పరమయోగు లానందించే-ప్రణవ నాదమూ

శ్రీ, తరిగొండ నరహరినిఁ జూపే-తారక నాదమూ ॥వింత॥ ౫

వ. అప్పు డా నాదంబు విని, నక్కజోగి వెక్కిరింపుచు వచ్చి, హరినిఁ జూచి యిట్లనుచున్నాడు: 7

## ✳ నక్కజోగి - శ్రీకృష్ణుల సంవాదము ✳

క. ఈ కాననమునఁ జేరిన
కాకులు మది భీతినొంది గగనముఁ జేరన్
నా కడను వేణు విటువలెఁ
జేకొని నాదంబుఁజేయఁ జెల్లునటోయీ? 8

వ. అనిన విని శౌరి యిట్లనుచున్నాఁడు: 9

తే.గీ. 'ఎవఁడురా! నీవు? తెల్పరా! వివరముగను'
'నీ వెవరు? మున్ను దెల్పరా! నిజముగాను'
'మంచి దట్లైతె విను నేను మాధవుఁడర!'
'మాధవుఁడవైతె నీవు, నే గీధవుఁడర!,' 10

వ. అని నక్కజోగి 'నీ వృత్తాంతంబంతయుఁ దెల్పు' మనిన, విని శ్రీకృష్ణుం డిట్లనుచున్నాఁడు: 11

ద్విపద. వినుము నా తెఱఁగెల్ల-[5]విశదంబుగాఁగ
ననువంద మున్ను మ-త్స్యావతారంబు
సురుచిరంబుగఁ దాల్చి-సోమకుఁ ద్రుంచి
ధర నెన్న వేదముల్-ధాత కిచ్చితిని.

5. విశదంబుగాను- క

కూర్మావతారంబు-కొమరొప్పఁ దాల్చి
ధర్మార్థముగ ధరా-ధరము మోచితిని.
సూకర రూపమై-శోధించి మించి
ప్రాకటహేమాక్షు-బల మణంచితిని.
అటమీఁద నారసిం-హాకృతితోను
కుటిలాసురుని నేలఁ- గూల్చి చంపితిని.
పరఁగ వామనుఁడనై-బలిచక్రవర్తి
నరసి పాతాళమం-దణఁగఁ ద్రొక్కితిని.
పరశురాముఁడనై ప్ర-భావంబు మించి
పరువడిగా నర-పతులఁ గూల్చితిని.
దశరథునకుఁ బుట్టి-తపసులఁ బ్రోచి
దశకంఠు నిర్జించి-తరుణిఁ దెచ్చితిని.
తెఱఁగొప్ప దేవకీ-దేవి గర్భాబ్ధి
నరుదుగా నిప్పు డే-నవతార మెత్తి
దుష్టరాక్షసులను-దునుమాడి, పరమ
శిష్టులఁ జేపట్టి-చెలఁగి భూభార
మణఁగింతు; నాదు వృ-త్తాంత మి [వ్విధము].
[గుణముతో నీ వి ది]-గుఱుతుగాఁ దెలియు!
నాపేరు కృష్ణుఁ డె-న్నఁగ ధాత్రిలోన,
నీ పేరు చెప్పురా! - నిజముగా నిపుడు.

(వ. అనిన విని నక్కజోగి యిట్లు చెప్పుచున్నాడు:) 12

ద్విపద. విను కృష్ణ! నా పూర్వ-వృత్తాంతమెల్ల
మనుపెందు దరిలేక-మూలనె యుండి

[6]మాయవాదైనట్టి-మాతంగిఁ గూడి
గాయకుండగుచు నే-గర్వించినాను
కాకులనే సాకి - ఖండించినాను
మేకపోతులఁ బట్టి - మెడ నులిఁబెట్టి
బలమైన మాంసంబు - భక్షించినాను
తలిదండ్రులే లేక - దరిబేసి [7]తిరిప
మె......................................నఁగ
..........................................
నేపార పాముల - నెప్పు డాడింప
నా పేరు పాముల - [8]నక్కజోగంద్రు.

క. అని నక్కజోగి పలికిన
విని, తత్త్వముఁ దెలిసి శౌరి విశ్వాసముగాఁ
గనుఁగొని, పిమ్మట [9]సొగసుగ
వనజోదరుఁ దప్పు వేణు వాదనఁ జేసెన్. 13

## ❊ గోపాంగనల పయనములు ❊

ద్విపద. ఆ నాదమపుడు గో-పాంగనామణుల
వీనులలో నాటి-వెఱఁగు నొందింపఁ,
దబ్బిబ్బు నొందుచుఁ-దమపనుల్ మఱచి
నిబ్బరంబున నంత-నీరజనేత్ర
లందఱు నొకచోట-నమరఁగాఁ గూఁడి
బృందావనములోని - ప్రియుని చెంగటికిఁ

6.మాయవాది+ఐనట్టి- అని పద విభాగము, 7. తిరిపె-క, 8. నక్కజోగి+అంద్రు-
అని పద విభజనము. 9, సొగసున - క.

బదపదండని వేగఁ- బైనంబులైన
'నిది యేమి వింత? మీ-రెటు బోదు?' రనుచుఁ
దలిదండ్రు లన్నలు - తమ్ములు మిత్రు
లలుగఁగాఁ, బ్రాణేశు - లత్తమామలును
వలదని వారింప, - వారి మాటలకు
నిలువక పోయెదు - నెలఁతల మీఁదఁ
బనిఁబూని దండెత్తి - పంచబాణుండు
వనజాంతకుఁడు దళ - వాయిగా నడువఁ
బికకాహళీధ్వనుల్ - బెట్టుగా మ్రోయ
శుకదంతిపై నెక్కి - శూరుఁడై వెడల
భృంగముల్ చెలరేఁగి - ప్రియతాళ గతుల
సంగీతములు సేయ - సారెకు వేడ్క
మదమునఁ బొదలుచు - మలయానిలుండు
పదరుచు విరహాగ్నిఁ - బ్రబలంబు సేయఁ
జలమున మారుండు - చక్కఁగాఁ జెఱకు
విలు గుణధ్వని చేసి - విరుల నారాచ
ములు వేగ సంధించి - ముగ్ధల మర్మ
కళలంట నేసినఁ - గళవళంబంది
'యింకమీఁదట మన - కీ యరణ్యమునఁ
బంకజాక్షుఁడె గాని - ప్రాపులే' దనుచు
భామలు ముందఱఁ - బరువెత్తి [10]పోవఁ,
గాముఁడు వెంటనే - కదలి వేవేగఁ
దఱుమఁగా, నపుడు బృం - దావనంబునకు
వరుస నా గోపికల్ - వచ్చి యిట్లనిరి:

10. రాగ - క

## ✳ గోపకాంతల వినుతి ✳

### దరువు - త్రిపుట తాళం

శరణు శరణూ - శరణు శరణూ
శరణు శరణూ - శరణు శరణూ ॥పల్లవి॥

శరణు శరణు త్రిలోక నాయక!
శరణు పురహర సాయకా!
శరణు ముక్తిఫలప్రదాయక!
శరణు భక్త సహాయకా! ॥శరణు శరణూ॥ ౧

శరణు యోగి మనోబ్జ బంబర!
శరణు శరణు చిదంబరా!
శరణు ప్రవిమల కాంచనాంబర!
శరణు మాయాడంబరా! ॥శరణు శరణూ॥ ౨

శరణు శ్రీతరిగొండమందిర!
శరణు [11]వత్స ధృతేందిరా!
శరణు మోహన! దివ్యసుందర!
శరణు దరనిభకంధరా! ॥శరణు శరణూ॥ ౩

వ. అని నమస్కరించి, మఱిన్ని వేర్వేఱ నిట్లనుచున్నారు: 14

### దరువు - ఆది తాళం, మూడవ అక్షరం

బాల గోపాలా! హరే! ॥పల్లవి॥
మాం రక్ష శౌరే! బాలగోపాలా! హరే!
బాలగోపాలా! పావన శీలా!-బాలగోపాలా! హరే! ॥ఉపపల్లవి॥

---

11. వత్సధృత+ఇందిరా! = శ్రీవత్సమున ధరింపబడిన యిందిరాదేవి కలవాడా!- అని యర్థము.

నందకుమారా!-నగవరధీరా!
సుందరాకారా! హరె!-మ్మాం రక్ష శౌరే! ॥బాల॥ ౧

మురళీ విలోలా!- మోహన లీలా!
దురితవిఫాలా! హరే!-మాం రక్ష శౌరే! ॥బాల॥ ౨

తరిగొండాధీశా!-తరణి సంకాశా!
వరచిదాకాశా! హరే!-మాం రక్ష శౌరే! ॥బాల॥ ౩

వ. అని యిట్లు వేర్వేఱ వినుతించిన, గోపకాంతలఁ జూచి గోవిందుఁ డిట్లనుచున్నాడు: 15

## ✳ గోవిందుని హితవు - గోపికల యుత్తరము ✳

శా. ఏమే సుందరులార! రేయనక మీ రిందెందుకున్ వస్తిరే?
ఈ మందావల నీవలన్ మృగగణం బేవేళఁ [12]గాచుండునే!
ఈ మాడ్కిన్ బలువంతకారులయి మీరిట్లా పనుల్ చేతురే?
రామారత్నములార! చాలుఁ జనరే! రట్టేల? మీ యిండ్లకున్. 16

(వ. అనిన విని గోపకాంత లిట్లు విన్నవించుచున్నారు:) 17

శా. శ్రీ లక్ష్మీశ్వర! నీ పదాబ్జములు మా చిత్తంబులో నాట, మే
మే లోకాళి నెఱుంగకన్ భ్రమసి యిట్లీ త్రోవ రాఁజూచి మ
మ్మాలో మారుఁడు మిక్కిలిం దఱుమఁగా నత్యంతతాపంబుచే
నీ లోకభ్రమవీడి వచ్చితిమి మమ్మోక్షించు గోపాలకా! 18

(వ. అనఁగా శ్రీకృష్ణుఁ డిట్లు పల్కుచున్నాఁడు:) 19

12. కాచి + ఉండునే - అని విభజనము.

ద్విపద. ఇది యేమి సతులార! - యివ్విధంబునను
మది నీతిఁ దెలియని - మాట లేమిటికి?
ఇలలోను మీరు మీ - యిల్వాడి రోసి
తలిదండ్రులకుఁ జాలఁ - దలవంపుఁ జేసి
అన్నదమ్ములకెల్ల - నపకీర్తిఁ జేసి
కన్నబిడ్డలకును - కడగండ్లు గూర్చి
పతుల మానంబులు - భంగంబు చేసి
హితుల కందఱికిని - నెగ్గుఁ గైసేసి
చెనఁటులై వ్రతములు - చెడుటయె కాని,
[13]యనుభవం బిసుమంత - యైనను లేదు
పరఁగంగఁ బతి విన్నఁ - బ్రాణముల్ గొనును
ధరణీశుఁ డెఱిఁగిన - దండుగఁ దీయు
నత్తమామలు విన్న - నప్పుడె మీకుఁ
దెత్తురు నవతుల - ధీరత్వ మెసఁగ,
నేరాండ్లు విన్న మి - మ్మెప్పుడు నగుదు,
రూరివా రిది విన్న - నుప్పతించుదురు,
మాతామహులకును - మఱి పితామహుల
కీ తీరుగా నింద - లేల తెచ్చెదరె?
ఇది యమునా తీర, - మిదె త్రోవ, మల్లె
పొదల చాటున డాఁగి - పోరె! యిండ్లకును

వ. అనిన విని గోపకాంత లత్యంత చింతాక్రాంతలై యిట్లను చున్నారు: 20

13. యనుభవంబున భయం - బిసుమంత లేదు - క.

## దరువు - ఆది తాళం, నాలుగవ కాలం

ఇమ్మాయఁ జేసి మమ్ముఁ - బొమ్మానెవాని నిన్ను ౧
నమ్మితి మయ్యో! మురళి - నాదావినోదా!

పోదామన్నాను పోను - పాదాము లాడ విప్పు
దే దారి మాకు మురళి - నాదావినోదా? ౨

ఆదరించక మమ్ముఁ - గడచన మేర గాదు
నీ దయే రక్ష మురళి - నాదావినోదా! ౩

యాదవాధీశ! విరహ - వేదానఁ బొంది పొంది
మా దేహా లలసె, మురళి - నాదావినోదా! ౪

గురుతారమైన తారి - గొండా నివేశ! వీర
నరసింహదేవ! మురళి - నాదావినోదా! ౫

(వ. అంత శ్రీకృష్ణుఁడు వారలతో నిట్లనుచున్నాడు:) 21

సీ. వినరె గోపికలార! విభులను విడనాడి
పరుల సేవించుట పాడి గాదు
ఒంటిగా నిపుడు నే నున్నచోటను మీరు
తఱచుగా మాట్లాడఁ దగవు గాదు
తమకంబుతో నన్నుఁ దగిలి, పిమ్మట లోక
నిందఁ బొందుట మీకు నీతి గాదు
కనులు దేల్చుచు నాకుఁ గామతంత్రాసక్తిఁ
బుట్టించుటది మీకు బుద్ధి గాదు

తే.గీ. మగువ లిట్లుంగిఁ జెలరేఁగి మానధనముఁ
గోలుపోయినయంతటఁ గుఱుచఁదనమె
గాని, సత్కీర్తి నిజముగాఁ గలుగఁబోదు
గాన పతులనె చేరుఁడీ కాంతలార! 22

(వ. అనఁగా గోపకాంత లిట్లు విన్నవించుచున్నారు:) 23

క. పతులనె చూపుచు, నీమది
[14]హిత మింతయు లేక పల్మఁతేఁచఁగవలెనా?
గతి నీవె యనుచు వచ్చితి,
మతిశయ మోహంబు మించె నంబుధిశయనా! 24

**దరువు - ఆది తాళం, రెండవ కాలం**

అంబుధిశయనా! - అంబుజనయనా! ॥పల్లవి॥
అంబుదశ్యామా! - ఆగమసీమా! ॥అంబుధి॥ ఉపపల్లవి॥

చిన్ననాఁడే వలపించి - చిత్తమూల నపహరించి
చిన్నెల నీ విపుడు మించి - చేరనీవు గారవించి ॥అంబుధి॥ ౧

మించి మరుఁడు శరము లేయ - మేనులు పరవశము లాయె
చంచలత్వ మధికమాయె-సైఁచఁగూడని [15]జాలాయె ॥అంబుధి॥ ౨

సంతసాముతోను మేము - సామి! నిన్నె నమ్మినాము
పంతమేలా? తారిగొండా-పాలకా! కౌఁగిలియ్యరా! ॥అంబుధి॥3

(వ. అంత శ్రీకృష్ణుఁ డిట్లనుచున్నాఁడు:) 25

14. హిత వింతయు లేక - క. 15. జాలి+ఆయెన్ - అని పద విభాగము.

క. ఎంతైనను మీరలు పర
కాంతలు, తలిదండ్రిచాటు గలవాఁడను నే,
వింతలు చేసిన మీతో
సంతసముగ నవ్వవెఱతుఁ జాలును పోరే! **26**

**దరువు - ఆది తాళం, నాలుగవ కాలం**

చాలు పోరే! - చాలు చాలు పోరే! ॥పల్లవి॥
చాలు చాలు బలు - జాలములను న
న్నేల మీరు - తేలించేరే? ॥చాలు పోరే! ॥ఉపపల్లవి॥
పరమ పతివ్రత - లరయఁగ ధరణిలో
పరులకు మానము లిత్తురా?
-భయము లేక యిటు వత్తురా? ॥చాలు పోరే!॥ ౧
పొందుగ మీ మీ - పురుషులు వచ్చిపు
డిందిందును [16]పొంచుందురే!
- యీ పనైతె యేమందురే? ॥చాలు పోరే!॥ ౨
వరతరిగొండ నృ - హరి యింతటి పని
దొరకొనెనని నను దూరేరే!
- దుడుకని చలమునఁ బోరేరే! ॥చాలు పోరే!॥ ౩

(వ. అనిన, గోపాంగన లిట్లు పల్కుచున్నారు:) 27

ఆ.వె. వెఱపు లేని చోట వెఱపిట్లు గల్పించి
మమ్ము నేఁచనేల? మాయదారి!

16. పొంచి+ఉందురే! - అని విభజనము.

ఇట్టి బూటకంబు లెన్ని చేసిన మేము
నిన్ను విడిచిపోము నీరజాక్ష! 28

తే.గీ. పద్మగంధంబు మరగిన భ్రమరకాంత
లన్య కుసుమంబు లాత్మలో నాసపడునె?
నిన్ను మరగిన కామినుల్ నీచులందు
భ్రమఁ దలంతురె కలనైన బాలకృష్ణ? 29

## దరువు - ఆది తాళం, మొదటి కాలం

బాలకృష్ణా! హరే! - బాలకృష్ణా! ॥పల్లవి॥
బాలకృష్ణా! నీ వింతా - జాలము నేర్చి మాకూ
జాలి గలుగఁజేసి - జాణమాట [17]లాడేవేరా?॥బాలకృష్ణా!॥ ఉపపల్లవి॥

మున్నుగానె మనసిజుఁడూ - ముందర మోసాముఁజేసి, నేఁడూ
నిన్ను శరము లేయలేఁడూ - నిలిచి మమ్మేఁచేది చూడూ
॥బాలకృష్ణా!॥ ౧

విరహశిఖిలోఁ జిక్కినాముా - వేదనా కోర్వలేముా
సరసిజాక్షా! నీ పుణ్యము - చల్లని కరుణఁ జూడుముా
॥బాలకృష్ణా!॥ ౨

పతుల నింకా మే మొల్లము - బంధువులను విడిచినాముా
సతముగా శ్రీతరిగొండా - స్వామి! నిన్నే నమ్మినాముా
॥బాలకృష్ణా!॥ ౩

( వ. అనిన, బాలకృష్ణుఁ డిట్లు ఉపదేశించుచున్నాడు:) 30

---

17. లాడేవురా! - క.

ఆ.వె. పతి కురూపియైనఁ, బాపాత్ముఁడై యున్న,
నధిక రోగియైన, నంధుఁడైనఁ
బతిని వీడరాదు భామల కెందును
ధర్మశాస్త్ర మిదియె తరుణులార! 31

## ✳ గోపికలు బాలకృష్ణుని బ్రతిమాలుట ✳

(వ. అనిన విని, గోపికలు బాలకృష్ణు నీ విధముగా బ్రతిమాలుచున్నారు:)32

### దరువు - అట తాళం

గోపాల! మమ్మింత - యేఁపవలెనా?
మ మ్మేఁపవలెనా? ॥పల్లవి॥

మా పతులనే మాకుఁ - జూపవలెనా?
మాకుఁ జూపవలెనా? ॥గోపాల!॥ఉపపల్లవి॥

అక్కటా! మమ్ము విడ - నాడవలెనా?
మమ్ము విడనాడవలెనా?
సొక్కించి కడఁగంటఁ - జూడవలెనా?
మమ్ముఁ జూడవలెనా? ॥గోపాల!॥౧

తిరుగా యింటికి మమ్ముఁ - ద్రిప్పేదేనా?
మమ్ముఁ ద్రిప్పేదేనా?
తరిగొండ హరి! దయఁ - దప్పేదేనా?
దయఁ దప్పేదేనా? ॥గోపాల!॥౨

వ. అనిన విని గోపకాంతలఁ జూచి, హరి నగుచు నిట్లనుచున్నాడు: 33

ఉ. చక్కనివారు మీరు, బలు జాణతనంబులు నేర్చినారు; నేఁ
జక్కనివాఁడఁగాను, తగు చాతురి నేరను; తేర కూరకే
[18]చక్కెర బొమ్మలార! యిటు జాలినిఁ బొందఁగనేల? మీకు నా
మక్కువ లేల? మీ పతుల మంచితనంబునఁ గూడియుండరే! 34

(వ. అంత గోపకాంతలు బాలకృష్ణు నీ రీతిగాఁ బ్రశ్నించుచున్నారు:) 35

ఉ. చక్కనివాఁడ వీవనుచు సమ్మతమొప్పఁగఁ గోరి నేఁడు మే
మిక్కడ వచ్చి మీ పదము లింత భజించిన నాదరింపవే?
చక్కనివారమైన నెఱజాణతనంబులు నీవు చేతువే?
అక్కఱలేని మోహ మిటులాయె, నిఁకేమనవచ్చు మాధవా? 36

(వ. అంతట గోపికలతో బాలకృష్ణుఁ డిట్లు పల్కుచున్నాఁడు:) 37

తే.గీ. ఇంత నిష్ఠురములు పల్కుటేల [19]మీరు?
కరుణ లేనట్టివాఁడను గాను నేను,
నిఖిలకారణకర్తనై నిలిచియుండి
[20]ధర్మహానెట్లు చేతునో తరుణులార? 38

(వ. అందులకు గోపాంగన లిట్లు సమాధాన మిచ్చుచున్నారు:) 39

తే.గీ. ఇది యధర్మముగాఁ దోఁచుటేల నోయి?
స్త్రీ పురుష రూపయుక్తిచే సృష్టిఁజేసి
నిఖిల భూతాంతరాత్మవై నిలుచు నీకుఁ
బరులనఁగ నెవ్వరున్నారు? పరమపురుష! 40

(వ. అప్పుడు బాలకృష్ణుఁడు గోపికలకు సంతోషకరముగా నాదరముతో నిట్లు పల్కుచున్నాఁడు:) 41

---

18. చక్కని బొమ్మలార! – క, 19. మీకు – క. 20. ధర్మహాని+ఎట్లు – అని పద విభజనము.

## ✳ బాలకృష్ణుని యాదరణము ✳

ద్విపద. వినరె గోపికలార! - వింతగా నిపుడు
మనసుఁ జూచుట కన్ని-మాటలాడితిని
అంతియకాని నా - కరమర లే, ద
దెంత కార్యంబైన - నే నిగ్రహింతు
భయమొంద నేటికిఁ - బంచబాణునికి?
జయభేరి వేయించి - సాధింత మతని,
నిడుమలఁ బెట్టితి - నీ వేళ దనుకఁ,
గడు వేగమున - రారె! - కౌఁగి లిచ్చెదను.

**దరువు - ఆట తాళం**

అలివేణులార! మీ - యళుకు బెళుకులాకు
కలువాల చెలికాని - కళలాకు సొలసీ, నే
వలచితిఁ గదరే! - వనజాక్షులారా! ౧

పంచశరునీ చాయ - మించ నియ్యని మాయఁ
బెంచి, మీ భక్తి భా-వించి, మన్నించి, మో
హించితిఁ గదరే! - యెలనాఁగలారా! ౨

వగమీఱఁ దరిగొండ - వాసుఁడనై యుండి
సగుణ భోగములాకు - సాక్షి నగుచు, మిమ్ముఁ
దగిలితిఁ గదరే! - తరలాక్షులారా! 3

క. అని యిట్లు బాలకృష్ణుఁడు
వనజాక్షుల నాదరించి వైభవలీలన్

మనసిజకేళిని నిజముగ
మొనయుచు నస్ఖలితతేజమునను రమించెన్. 42

## ✳ శ్రీ కృష్ణుని నృత్యము - అంతర్ధానము ✳

వ. తదనంతరంబున హరి నృత్యంబుఁ జేసే విధం బెటువలెను. 43

### దరువు - ఆది తాళం, మొదటి అక్షరం

ఆడెనే! కృష్ణుఁ - డాడెనే! ॥పల్లవి॥

ఆడెనే! శ్రీకృష్ణుఁ - డమరులు నభమునఁ
జూడఁగ ధరణిలో - శోభిత లీలల ॥నాడెనే!॥ ఉపపల్లవి॥

జోడుగ సుదతులు - పాడఁగ, ముదమునఁ
జూడఁగ, శరణని - వేడఁగ, [21]నవ్వుచు ॥నాడెనే!॥ ౧

మొలనూలి గజ్జెలు - మువ్వలు, నందెలు
గలిబిలిగా ఘలు - ఘల్లని వేడుక ॥నాడెనే!॥ ౨

చెలులకు మోహము - చెలఁగఁగఁ బలుమఱుఁ
గులుకుచు శ్రీతరి - గొండ పురాధిపుఁ ॥డాడెనే!॥ ౩

వ. ఇవ్విధంబున హరి చేయు నృత్యంబుఁ జూచి గోపకాంతలు క్రమ్మఱ మదనతంత్రాసక్తలైన, వారియొక్క మక్కువ శాంతింపఁజేసి ప్రసన్నుండ నవుదునని తలంచి యదృశ్యుండైన, శౌరినిఁ గానక గోపాంగనలు తమలోఁ దా మిట్లనుచున్నారు: 44

21. నుబ్బుచు - క.

## ✳ గోపికల అన్వేషణ ✳

### దరువు

ఏఁడె కృష్ణుఁడు? -[22]ఏడోనె! వో భామా! ౧
చూడలేద కృష్ణుని? - చూడలేదె భామా! ౨
వెదకుదామ కృష్ణుని? - వెదకుదామె భామా! ౩
పట్టుదామ కృష్ణుని? - పట్టుదామె భామా! ౪
చిక్కెనేమె కృష్ణుఁడు? - చిక్కలేదె భామా! ౫
ఇంక యెట్ల నమ్మయ్య? - యేమిజేతా మక్కయ్యా? ౬
ఎంత జేసె నమ్మయ్య! - యేమి జెప్పు దక్కయ్యా? ౭
జాణ గదరె! కృష్ణుఁడు? - సత్యమేనె భామా! ౮

వ. అని పలికి, మఱిన్ని తమలోఁ దామిట్లనుచున్నారు: 45

సీ. ఇంతలో శ్రీకృష్ణుఁ డెంతదూరము పోవు
వెనువెంట నంటరె! వెలఁదులార!
వెనువెంటనే పోయి వెదకి పట్టుటకు వాఁ
డరిగిన త్రోవ యే దమ్మలార?
అరిగిన త్రోవకిం తనుమానపడనేల?
దిక్కుల వెదకరె! తెఱవలార!
దిక్కుల వెదకితె ధీరాత్ముఁ డిప్పుడే
చిక్కునా? మనచేతఁ జెలియలార!

తే.గీ. చిక్కకుండిన నెట్లనో యక్కలార?
ఎట్ల యనుచును జెప్పరో! యింతులార!
[23]చెప్పరేదైన యుక్తినిఁ జేడెలార!
యుక్తు లిక్కడ సాగునా? యువిదలార! 46

22. ఏడనో - క. 23. చెప్పరే! యేమి యుక్తైన - క.

## దరువు - ఆట తాళం

అక్కరగా యిక్క - డాడినట్లనె యుండి
యెక్కడఁ బోయెనో? - యిలలోను వాఁడెంత
తక్కులమారె! వో - తరళాక్షులారా! ౧

ఇట్టట్టు నటియించి - యీ వేళ మనలాను
నట్టడవిలో డించి - నగుబాటుఁ జేసెను
కట్టడి గదరె! వో - కలకంఠులారా! ౨

నమ్మించి తరిగొండ - నరసింహుఁ డీ వేళ
కమ్మవిల్తుని పాలు - గాఁ జేసె, వాఁడెంత
దిమ్మరి గదరె? వో - యమ్మయ్యలారా! ౩

వ. అని యిట్లు హరిని దూఱి పలికి, తమ సమీపంబున నున్న మహీజంబులఁ జూచి యిట్లనుచున్నారు: 47

సీ. మందార! కానవె? మందరోద్ధారుని,
ఖర్జూర! కానవె? కలుషహరుని,
జంబీర! కానవె? జంభారి వినుతుని,
శైలూష! కానవె? సత్యహితుని,
హింతాల! కానవె? యిభరాజవరదుని,
తక్కోల! కానవె? తత్త్వధనుని,
అర్జున! కానవె? యర్జునచేలునిఁ,
జంపక! కానవె? చక్రధరునిఁ,

తే.గీ. జూతపాదప! కానవే? శుభచరిత్రు,
వటమహీజము! కానవే? వనజనేత్రు,

సాలవృక్షమ! కానవే? శ్యామగాత్రు,
శింశుపాద్రుమ! కానవే? శ్రీకళత్రు. 48

వ. అని, తదనంతరంబున సుమలతల నుద్దేశించి యిట్లనుచున్నారు:49

## దరువు - అట తాళం

సుందరాకారుఁ డిందు - రాలేదా? వో లతికలారా!
మమ్ము, పొందినట్లనెయుండి - బొంకించెనే సుమలతికలారా! ౧
మన్నించెనని యుంటె - మాయఁజేసెనే సుమలతికలారా! ౨
వాని, చిన్నెల వలలోను - జిక్కితిమే సుమలతికలారా! ౩
అరుదుగ మరుదాడి - యధికమాయెనే సుమలతికలారా! ౪
మీ, రరసి మా తరిగొండ - హరి నిందుఁ జూపరే లతికలారా! ౫

వ. అని యిట్లు లతల నడిగి, భూధరంబులఁ జూచి యిట్లనిరి: 50

ఉ. నవ్వుముఖంబువాఁడు, మృదునాద సువేణువుఁ బూనినాఁడు, వాఁ
డ్వివసుధావధూరమణుఁ, డిందిరకున్ ప్రియుఁడైనవాఁడు, మా
యవ్వనమూల్య మిప్పు డతఁడంతయు ప్రుచ్చిలి తెచ్చినాఁడు,బల్
రవ్వలు చేసినాఁ, డిటకు రాఁడు గదా? గిరులార! చెప్పరే! 51

వ. అని పర్వతంబుల నడిగి చాలించి, తమలోఁ దా మిట్లనుచున్నారు:52

## దరువు - [24]ఆది తాళం, రెండవ కాలం

ఇంతగా నమ్మిక లిచ్చి - యిప్పుడె బొంకించిపోయె
కాంతలారా! వాని - గుణముఁ గంటిరటరే! ౧

24. అట తాళం - క.

అక్కర లేనట్టి మోహ - మంతెగాక, మన మెన్ని
యిక్కువలు చేసినా, వాఁ - డిక్కడ వచ్చునటరే? ౨

అక్కలారా! మీ కీ మాట - కనుమానమేలాను, మనకు
దక్కినాఁడూ తరిగొండ - ధాముఁ డనరే! ౩

సీ. అట్లైతె యీ త్రోవ నరిగి కొందఱు వాని
గట్టిగఁ బిలువరె! కాంతలార!
ఆ త్రోవలను కొంద ఱడ్డంబుగా నుండి
పొంచి పట్టరె! వానిఁ బొలఁతులార!
పూఁబొదరిండ్లకుఁ బోయి డాఁగీ, నందుఁ
గొంద ఱుండరె! మీరు కొమ్మలార!
ఇందులోఁగాఁ గొంద ఱీ ప్రాంతముల వానిఁ
జూచుకయుండరె! సుదతులార!

తే.గీ. పదరె! వెదకుద మంతట భామలార!
జాడ ముందుగఁ జూపరె! సకియలార!
ఎక్కడను జాడ చిక్కలే దింతులార!
చిక్కెఁ జిక్కెను రారమ్మ! చెలియలార! 53

### దరువు - సౌరాష్ట్రరాగం, త్రిపుట తాళం

ఏడ వెదకిన నేమి యున్నది - చేడెలారా! కృష్ణుని
జాడ యీ పొద - వార నున్నది చూడరమ్మా! ౧

ఇందు పాదము మోపి, యీ శిల - నెక్కినాఁడూ; తిరుగా
నందు పాదము మోపి దిగి, త్వర - నరిగినాఁడూ. ౨

ఈ పదములే మౌని చంద్రుల - హృదయమందూ, వెలిఁగెడి,
నీ పదములే మనకు నెల్లపు - డిష్టదములూ. 3

వ. అని, మఱిన్నిట్లనుచున్నారు: 54

సీ. ఇక్కడ నిలిచినాఁ, డీ దిక్కుఁ జూచినాఁ,
దక్కడ నడచినాఁ డతివలార!
ఈ కొమ్మ వంచినాఁ, డీ పండ్లు గోసినాఁ
డా పూలు రాల్చినాఁ డమ్మలార!
ఇందుండి యెవతెనో యెత్తుకపోయినాఁ,
డక్కడ దించినాఁ డక్కలార!
అంతలో శౌరికి నా యింతి వేడ్కగా
నిక్కి ముద్దిచ్చింది నెలఁతలార!

తే.గీ. పాదములు నాల్గు నిచ్చట భామలార!
ఎదురెదురుగానె యున్నవి యింతులార!
చూడరే! యిప్పు డీ జాడ సుదతులార!
ఎంత విటుఁడమ్మ! కృష్ణుఁ డో కాంతలార! 55

వ. అని యిట్లు హరిలీలలు దలంచుచున్న సమయంబున మన్మథుండు సేనాసమేతంబుగా వచ్చి యెదుట నిలిచిన, నిట్లనుచున్నారు: 56

తే.గీ. జాడమాత్రము చిక్కినా చక్రధరుఁడు
చిక్కఁ డాయెను గావునఁ, జిలుకతేజి
రౌతు మనలను వేఁటాడ రతినిఁ గూడి
వచ్చెఁ జూడరె! యీ దిక్కు వనితలార! 57

## ✳ గోపకాంతల దీనాలాపములు ✳

### దరువు - అట తాళం

ఎట్లా తాళుదమే?

ఈ రాతిరి – యే రీతి బాళుదమే? ॥పల్లవి॥

ఎట్లా తాళుద?–మిట్లా మదనుఁడు
పోట్లాడఁగా వచ్చె, – మాట్లాడఁడు శౌరి ॥ఎట్లా॥ ఉపపల్లవి॥

వెన్నెల చురుకాయెనే! జడలమీఁది – విరులన్ని కరుకాయెనే!
వెన్నుఁ డిట్టీ వేళ – విడనాడే దెఱుఁగక
ఉన్నతావులు వాసి – యూరకే వస్తిమి ॥ఎట్లా॥ ౧

చిలుకలు చెలరేఁగెనే! కోవెలలన్ని – చేరి కుయ్యఁగసాగెనే!
మొలకనవ్వుల ముద్దు – కలికిగోపాలుఁ డి
ట్లలుక చేసిన రీతిఁ – బలుకఁడాయెను వచ్చి ॥ఎట్లా॥ ౨

పవనుఁడు రెట్టించెనే! కాముఁడు పుష్ప – బాణములు సంధించెనే!
ధవళాక్షులార! శ్రీ – తరిగొండ హరిమాయ
వివరింపఁగారాదు – వెదక శక్యముగా ॥దెట్లా॥ 3

వ. అని చింతింపుచు, హరి నుద్దేశించి దీనవాక్యంబుల నిట్లనుచున్నారు: 58

ద్విపద. ఓ ముద్దుగోపాల! – యో పుణ్యశీల!
ఓ మందరోద్ధార! – యో [25]నగధీర!
తోయజదళనేత్ర! – తొలుత మన్నించి
యీ యరణ్యమున మ – మ్మీ వేళ డించి

25. గుణహార – అ, నగధీర – క.

పోవుట ధర్మమా? - పురుషాగ్రగణ్య!
మా విభులను బాసి - మర్యాద రోసి
భావజు దాడిచే- భయమునఁ బొంది
నీవు బ్రోచెదవని - నెఱనమ్మి వచ్చి
మరుఁగుఁ జేరిన, నింత - మాయఁ జేసితివి;
పరమాత్మ! మమ్ము నీ - భక్తుల మనుచు
వలనొప్ప దావాగ్ని - వలన, దానవుల
వలన, శిలావృష్టి - వలన రక్షించి,
యలిఁగిన రీతి మ - హాటవిలోను
తులువ మారుని బారిఁ - ద్రోయఁగాఁ దగునె?
ధరణిలో శరణాగ - తత్రాణ బిరుదు
మరువనేఁటికి నేఁడు - మా నిమిత్తమున?
రావె! కృపామూర్తి! - రావె! ప్రాణేశ!
నీ విఁక రాకనె - నిమిష ముండినను
మానసజాతుఁడు - మననియ్యఁ డిచట
రా నందనందన! - రా దీనవరద!
ఎక్కడ నుండిన - నీ క్షణంబునను
మక్కువతో వచ్చి - మన్నింపు దయను.

వ. అని యిట్లు పలికిన గోపికల దీనాలాపంబులు విని, కరుణార్ద్ర
చిత్తుండై

## ✳ శ్రీకృష్ణుని రాక - జలకేళి ✳

### దరువు- సురటీ రాగం, ఆది తాళం

వచ్చెను కృష్ణుఁడు - వగ మీఱఁగా ||పల్లవి||
హెచ్చని కామిను - లెదురుగఁ జనఁగా
వచ్చెను కృష్ణుఁడు - వగమీఱఁగా ||ఉపపల్లవి||

ఘనతరముగఁ జిఱు - గజ్జెలు, మువ్వలు,
అనువుగ మొరసెడి - యందెలునూ
మొనసి పదములను - మ్రోయ నటింపుచు
ననఁబోణులఁ గని - నవ్వుచునూ ||వచ్చెను|| ౧

పరిశోభితముగ - బంగరు శాలువ
సరవిని చుంగులు - జాఱఁగనూ
ఉరమున సరిపెణ - లొరయఁగఁ, బదకము
లరుదుగ నిగనిగ - మెఱయఁగనూ ||వచ్చెను|| ౨

అలరిన శిఖిపిం-ఛావృత మకుటము
ధళధళ శిరమున - వెలుఁగఁగనూ
తలకొని పువ్వుల - దండలు గదలఁగఁ
గులుకుచు శ్రీతరి - గొండకునూ ||వచ్చెను|| ౩

వ. ఇవ్విధంబున వచ్చిన హరినిఁ జూచి గోపకాంతలు సరసోక్తులఁ దమలోఁ దా మిట్లనుచున్నారు: 60

### దరువు - అట తాళం

బాలామణులారా! గో - పాలా బాలుఁడు జిక్కె
పాలా ముచ్చును వేగా - పట్టరమ్మా! వో చెలులారా! ౧

పూలా దండల వానీ - పొందుగాఁ గట్టీ, జడలా
కోలాహలముఁ జేసీ - కొట్టుదామా? వో చెలులారా! ౨

ఇక్కడా మమ్మును డించి - యెక్కడాఁ బోయితివాని
చిక్కఁబట్టుక చెక్కిలి - నొక్కుదామా? వో చెలులారా! ౩

అప్పటినుంచీ మా కింతా - త్రిప్పటాఁ జేసింది
తప్పని పుప్పొడి మేనా - గుప్పుదామా? వో చెలులారా! ౪

నయముఁ జేసీ తారిగొండా - నారసింహుని లాలించి
ప్రియముగానే కౌఁగిటికీ - పిల్వరమ్మా! వో చెలులారా! ౫

వ. అని యిట్లు సరసోక్తులఁ బలుకు వ్రజసుందరులకు వివిధవినోదం
బుల నానందబుఁ జేసి, తదనంతరంబున. 61

తే.గీ. శ్రీకరంబుగ గోపాల శేఖరుండు
ప్రాకటంబైన యొక కమలాకరంబుఁ
జేరి యచ్చటఁ జెలరేఁగి చెలులతోడఁ
గూడి వెలయ జలక్రీడ లాడుచుండె. 62

## ✳ రాధాదేవి యాగమనము ✳

ద్విపద. అంతట మేల్కాంచి - హరినిఁ దలంచి
సంతసంబున రాధ - జలరుహనాభుఁ
దెదురుచూచీనని - యెంచి చింతించి,
పదమని మారుండు - పైనంబుఁ జేయ
పల్లవాధరి పచ్చి - పసపొప్పు నలఁది
చల్లఁగాఁ బన్నీట - జలకంబులాడి

పరcగc జందురుకావి - పావడమీcద
సరిగ పువ్వులచీర - జంపుగాc గట్టి
ప్రవిమలమైనట్టి - పసిcడి కసీద
అవికc దొడిగి, దివ్య - రత్న హారములు
ముత్తేల పట్టెడ, - మొగపుల తీcగె
క్రొత్తగాc జేసిన - గుత్తంపు నాను
కంకణములును, చే - కట్లు, గాజులును
కంకుల కడెము, లుం - గరములు, చాల
పొందైన యొడ్డాణ - మును, వెలలేని
సందిలి దండలు, - జంపులు, రత్న
పుంజయుక్తంబులౌ - బుగడలు, పెద్ద
పంజుల కమ్మలుc, - బల్లేరుపూలు
సిస్తు మీఱcగ హంస - చెక్కిన నత్తు
విస్తారముగ నిట్టి - వింత భూషణము
లంగాంగమునc దాల్చి - యరవిరి సరులు
సంగతిగా గొప్ప - జడనిండc జుట్టి
కుచ్చులుగాc గొన్ని - కొనజడం గట్టి
పచ్చల రేఖణిc - బైదల నమరc
బొందించి, పాపట - బొట్టు ధరించి
ఇందు, సూర్యుల దాని - కిరుదల నుంచి
ముందటి కురులకు - ముత్యాలు గూర్చి
కుందనమునc దీరు - కుంకుమరేఖ
ఫాలభాగంబునc - బట్టుగా నునిచి
వాలుcగన్నులలోను - వగమీఱcగాను

సొగసు కాటుక దిద్ది - సోగలు దీర్చి
అగరుగంధముఁ బూసి - యద్దంబులోన
తన రూపమంతయుఁ - దప్పక చూచి
మనసులో ముదమంది - మత్తేభయాన
వీడెంబుఁ జేయుచు - విభునికిఁ దగిన
విడెము, సుగంధంబు, - విరుల బంతులును
ఫలములు చెలులచేఁ - బట్టించుకొనుచు
ఘులుఘుల్లుమని కాళ్ళ - గజ్జెలు మ్రోయ
నలువంద బృందావ - నంబున కపుడు
లలనాలలామ శ్రీ - రాధ యేతెంచె.

వ. అప్పు డా రాధ హరినిఁ బూర్వస్థానమందుఁ గానక, చెలులతో నిట్లనుచున్నది: 63

## ✳ రాధ శ్రీకృష్ణుని వెదకుట ✳

### దరువు - ఆదితాళం, నాలుగవ కాలం

ఎందున్నాఁడో, కృష్ణుఁ - డెందున్నాఁడో? ॥పల్లవి॥

ఎందున్నాఁడో? ముద్దుకృష్ణుఁ - డిందాఁకా నా కెదురుచూచి
యెందున్నాఁడో, కృష్ణుఁ - డెందున్నాఁడో? ॥ఉపపల్లవి॥

ఇన్నాళ్లు నే వచ్చే వేళ - కెదురుచూచుచుండి, కనుల
సన్నాలు సేయుచుఁ బిలిచీ - జారలీలాలు చూపేవాఁ
॥డెందున్నాఁడో?॥ ౧

ప్రొద్దు బోయెనని నా మీఁద - పద్దుఁ బట్టి నవ్వులాకు
సద్దు సేయకుండి, చాల - జాణతనముఁ జేసెనని వాఁ
॥డెందున్నాఁడో?॥ ౨

ఈ పానుపుమీఁదనుండి - యిపుడే లేచిపోయినాఁడు
గోపాలబాలుఁడు తరిగొండ - పుటభేదన నిలయుఁ
॥డెందున్నాఁడో?॥ ౩

క. ముచ్చటగా నా రాకకు
మచ్చికతో నెదురుచూచు మాధవుఁ డిపు డే
మిచ్చట లేఁడాయెను; మఱి
యెచ్చట నున్నాఁడొ తెలియ, దెట్లనె చెలియా? **64**

వ. అని పలికి, మఱి న్నిట్లనుచున్నది: 65

### దరువు - ఆది తాళం, నాలుగవ కాలం

గిరిధరుఁ జూపరె! గిరులారా!
శ్రీధరుఁ జూపరె!-వనచరులారా! ౧

విరహము మించెనె!-విరులారా!
తరమా? యోర్వను - తరులారా! ౨

తరిగొండేశుఁడు - తరుణులారా! నను
మరులు గొల్పె రా - మామణులారా! ౩

వ. అని పలికి, తన సమీపంబున నున్న ఖగగణంబుల నుద్దేశించి యిట్లనుచున్నది: 66

*సీ. కామినీమానస కామునిఁ గానరే?
లాలితోన్నత మరాళంబులార!
లాలితోన్నత నిర్మలానందుఁ గానరే?
పటుగానయుక్త బంభరములార!
పటుగానయుక్త సంభాషణుఁ గానరే?
శోభిత శ్రీరామశుకములార!
శోభిత శ్రీరామసోదరుఁ గానరే?
ప్రియతర మృదునాద పికములార!
ప్రియతరమృదునాద వేద్యునిఁ గానరే?
ఘననటనా శితిగళములార!
ఘననటనా శితిగళ మిత్రుఁ గానరే?
గగనచారి చాతకంబులార! **67**

వ. అని యిట్లు సమూహంబు నడిగి, తదనంతరంబున వేర్వేఱ నొక్కొక్క ఖగంబు నీక్షించి యిట్లనుచున్నది: 68

**దరువు - అట తాళం**

హాటకాంబరుఁడె చకోరమా!
వికసి - తాబ్జలోచనుఁడె చకోరమా!
చూడనైనవాఁడె చకోరమా!
వానిఁ - జూడ లేదేమె? చకోరమా! ౧

---

*ఈ సీసపద్యములో ఆఱుపాదాలు కలవు. ఆఱవపాదం ఉత్తరార్ధం మాత్రం ఆట వెలఁది పద్యపాదంగా ఏర్పడివుంది.

నగుమోము వాఁడె మయూరమా!
చూడ - నల్లనివాఁడె మయూరమా!
సొగసైనవాఁడె మయూరమా!
వానిఁ - జూడలేదేమె? మయూరమా? ౨

చక్కనివాఁడె మరాళమా!
విటుల - జాడాలవాఁడె మరాళమా!
సొక్కించినాఁడె మరాళమా!
వానిఁ - జూడలేదేమె? మరాళమా! ౩

వనమాలా ధరుఁడె మిళిందమా!
వేణు-వును బూనినాఁడె మిళిందమా!
ఘనతరయశుఁడె మిళిందమా!
వానిఁ-గంటె చూపవె! వో మిళిందమా! ౪

కుండాల కర్ణుఁడె కీరమా!
తారి-గొండా నివాసుఁడె కీరమా!
శుండాల వరదుఁడె కీరమా!
వానిఁ - జూచితె చూపవే కీరమా! ౫

క. భావజసుమబాణానల
మీా విధమున మించి వచ్చె, నెట్లు సహింతున్?
కోవెల! నీ వెందైనను
శ్రీ వల్లభుఁ జూచియున్నఁ జెప్పవె! ప్రేమన్. 69

వ. అని ఖగంబుల నడిగి చాలించి, దేవతలఁ బ్రార్థించి యిట్లను
చున్నది: 70

ద్విపద. వెరవొప్ప నా మొఱ - వినరయ్య! మీరు
వరమునులార! జీ - వన్ముక్తులార!
ఇన, చంద్రులార! య-క్షేశ్వరులార!
ఘనసిద్ధవరులార! గంధర్వులార!
పన్నగపతులార! - పక్షీంద్రులార!
కిన్నరులార! యో - గీర్వాణులార!
సంపూర్ణయశులార! - సాధ్యాఖ్యులార!
కింపురుషులార! య - క్షీణ భక్తిగను
మీకు మ్రొక్కెదఁగాని - మేదినీశ్వరుని
జోకతో నిటు దెచ్చి - చూపుఁ డీ వేళ.

వ. అని ప్రార్థించి, నవ్వులకు డాఁగియుండునో యేమో యని తలంచి, హరి నుద్దేశించి యిట్లనుచున్నది: 71

**దరువు - ఆది తాళం**

రారా! గోపాలస్వామి! రారా! ॥పల్లవి॥

ఊరకే వగలేల చేసేవురా? ॥రారా!॥ఉపపల్లవి॥

చాలాగ నీ మీఁద నెంతో - జాలిమాలాయె, తాళఁ
జాలా నీవేళ మాయ - లేల చేసే? విందు ॥రారా!॥ ౧

మారుఁడు నిర్దయను - సారె సారెకు బాణ వర్ష
ధారలు గురిసి నాతోఁ - బోరాటమునకు వచ్చె ॥రారా!॥ ౨

శ్రీకర! తరిగొండ - నారసింహా! యిన్నాళ్లు, నీదు
రాక గోరుచున్నఁ బ్రేమ-లేక యున్నా వీ వేళ ॥రారా!॥ ౩

వ. అని యిట్లు [26] విధవిధంబులఁ బలుకుచున్న సమయంబున హరి యోగమాయ స్త్రీరూపంబున రాధ కడకు వచ్చే విధం బెటువలెను. 72

## ✳ మాయిక రాక ✳

ద్విపద. జడివాన బురదలో - జలకంబు లాడి
చెడు జిడ్డు కంబడి - చింపిఁ గట్టుకొని
ఎఱ్ఱనై, నెత్తిన - హేయమైనట్టి
చిఱ్ఱవెండ్రుకలలో - జింజిరి గూడుఁ
బెట్టి కొప్పొనరించి, - బెరయఁగా నుల్లి
పొట్టుదండలు గట్టి, - పొసఁగ దీపంపు
వత్తి ముక్కు నలంచి - వైపుగాఁ జుక్క
హత్తించి ఫాలంబు -నందుఁ జెన్నొంద,
మంటి గంధముఁ దీసి - మైఁ బూసి, యొక్క
కంటిలో నీ, రొక్క - కంటిలో మంట
గ్రక్కఁగా నిక్కుచుఁ - గడు బుస లెసఁగఁ,
జక్కఁగా మేనెల్లఁ - [27]జెదలు పట్టంగ
మూఁడు కుంప ట్లొక - మూట గట్టుకొని
కోడిగ్రు డ్లొక దండ - గూర్చి ధరించి
నిక్కుచు నీల్గుచు - నెళవైన తతినిఁ
గ్రక్కున విడివడి - కడు వికారముల

26. విధవిధంబుగ - క. 27. చెదలు పుట్టంగ - అ, చెదలు పట్టంగ - క.

మడియలెల్లను మెచ్చ - మాయిక రాధ
కడ కేఁగుదెంచెఁ జొ -క్కంపు వైఖరిని.

వ. అప్పు డా మాయిక తన విభుని వెదకినట్లుగా నిట్లనుచున్నది: 73

## దరువు, ఆది తాళం

ఎందున్నాఁడో? ముసిలోఁ - డెందున్నాఁడో? ॥పల్లవి॥

ఎందున్నాఁడో ముసిలివాఁడు?
సందూల గొందూల డాఁగి ॥యెందున్నాఁడో?॥ ఉపపల్లవి॥

కంబాడి బొప్పిలోఁ దనకు - కావాలసినంత కొ
ట్టంబాలి పోయలే - దని యలిగి బిచ్చమెత్తా వచ్చి
॥యెందున్నాఁడో?॥ ౧

కుక్కాల నంజూడు తనకు - కొద్దిగాఁ బెట్టితి ననుచు
కొక్కారించి చాలదని - కొట్లాడి పోయిన ముసిలోఁ
॥డెందున్నాఁడో?॥ ౨

గండూమిాటి గుడిసెలోని - కుండాలెల్లాఁ బగులాఁగొట్టి
తుండూవాలె నొక్కచోట - దొంగరీతీ దాఁగి ముసిలోఁ
॥డెందున్నాఁడో?॥ ౩

## ✳ మాయిక రాధతో భాషించుట ✳

వ. అని యిట్లు మాయిక హాస్యంబుగా నటియించి, తదనంతరంబున రాధను జూచి యిట్లనుచున్నది: 74

*** దరువు - ఆది తాళం**

ఇందువదన! నీ వీ రాతిరి నేఁ- డిందెందొచ్చితి వమ్మా?
నేఁ డిందెందొచ్చితి వమ్మా? ౧

సుందరి! కృష్ణునిఁ జూడఁదలఁచి [28]నే - నిందు వచ్చితినె! కొమ్మా!
[29]నే నిందు వచ్చితినె! కొమ్మా! ౨

నెలఁతరో! కృష్ణుఁడు నీ కే వరు సిది - తెలుపఁగదే! వోయమ్మా!
ఇది తెలుపఁగదే! వోయమ్మా! ౩

ఇల్లాలుగ నన్నేలిన హరి మే - నల్లుఁడు గావలె నమ్మా!
మేనల్లుఁడు గావలె నమ్మా! ౪

అల్లునికిని ఇల్లా లెట్లైతివి? - తెల్లముఁ జేయఁగదమ్మా!
ఇది తెల్లముఁ జేయఁగదమ్మా! ౫

(వ. అనిన విని, రాధ యిట్లను చున్నది:)

ద్విపద. వినుమది తెల్పెద - వెలఁదిరో! నాకు
అనఘాత్ముఁడగు నందుఁ - డన్న గావలెను
వనితరో! వదినె గా - వలెను యశోద
ననుఁ బెంచి మాయన్న - నాచిన్ననాఁడు
కోరి నన్నొక వెట్టి - గొల్లని కిచ్చె
సారసాక్షిరో! వాని - సైఁపక వచ్చి
యూరక పుట్టింట - నుండి, గోపాలు
జారలీలలఁ జూచి - జాలినిఁ బొంది
గారాముగాఁ బెంచి - కడకు మోహించి

---

* ఇది సంవాద దరువు. మాయికకు రాధకు నడుమ కొనసాగిన సంవాదము (సంభాషణ) ఇందులో వివరింపఁబడినది.

28 & 29 నేఁ డిందొచ్చితినే! కొమ్మా! - క.

యీ రీతి నే వాని - కిల్లాల నగుచుఁ
గ్రమముగా నిత్య మీ - గతి వచ్చి పోదు
రమణిరో! నా పేరు - రాధిక యంద్రు.

వ. అనిన విని మాయిక హాస్యపూర్వకంబుగా నిట్లనుచున్నది: 76

### దరువు - ఆది తాళం

బాగాయెనే! రాధ! - బాగాయెనే! ॥పల్లవి॥

నీ గౌరవం బెంత - నీటాయెనే? నేఁడు
బాగాయెనే! - రాధ! బాగాయెనే! ॥ఉపపల్లవి॥

మగువ! మేనల్లుఁడే - మగఁడాయెనే! నీ
వగడుగా కుండే - దరుదాయెనే! ॥బాగాయెనే!॥ ౧
ఇంతైతి నే నెన్నఁ - డిది వీననే! నీ
వింతాలు విన నేఁడు - వెఱఁగాయెనే! ॥బాగాయెనే!॥ ౨
భామ! నీ గుట్టెల్ల - బయలాయెనే! నే
నీ మాట లందాటి - కెటిఁగింతునే! ॥బాగాయెనే!॥ ౩

వ. అని వెఱపించిన, వెఱచి రాధ యిట్లనుచున్నది: 77

### దరువు - ఆది తాళం, నాలుగవ కాలం

ఎవరితో నీ వనకవే! ॥పల్లవి॥

ఎవరితో నీ వనకవే! - యేమైనాను గైకోవే!
వివరించి శ్రీకృష్ణుఁడు నా - విభుఁడైనట్టి వర్తమాన
॥మెవరితో నీ వనకవే!॥ ఉపపల్లవి॥

అందెలైనా యిచ్చేనే! - హారాలైనా యిచ్చేనే!
పొందుగా నే నిందు వచ్చి - పొయ్యే వర్తమాన మింక ॥నెవరితో॥ ౧

కమ్మలైనా యిచ్చేనే! - కడియాలైనా యిచ్చేనే!
అమ్మా! నే నీ వేళ వచ్చి - నట్టి వర్తమాన మింక ॥నెవరితో॥ ౨

వరహాలైనా యిచ్చేనే! ఘన - వజ్రాలైనా యిచ్చేనే!
తరిగొండ నరహరి వలలోఁ - దగిలి నేను దిరిగే చంద ॥మెవరితో॥ ౩

* కుఱుచ జంపె

మంచి దెవరితోఁ - జెప్ప లేదే! నీవు
లంచ మిచ్చే - నంటివైనా. ౧

ఇచ్చేను గాని - యిందు రావే! నీ
వేమైన నిఁకఁ - గోరుకోవే! ౨

మఱి యేమి నే నొల్ల - నమ్మా! నిన్ను
మఱువ కొక టడిగేనె! - కొమ్మా! ౩

కొంక కది తెలుపవే! - చెలియా! నీవు
కోరినది యిచ్చేనె! - చెలియా! ౪

ఏమిపుడు గోరుకోనే! - యింక
నెపుడు నీ - యొద్ద నుండేనే! ౫

వ. అనిన విని రాధ యిది యెవరో యని తలంచి యిట్లనుచున్నది: 78

* ఇందు రాధా మాయికల సంభాషణ కలదు.

తే. సుదతి! యెన్నఁడు నే నిన్నుఁ జూడలేదు,
ఎచట నీ వుండి వచ్చితి విందు నేఁడు?
తరళలోచన! నీదు వృత్తాంతమెల్లఁ
దెలియఁజెప్పవె! నాతోను తేటగాను. 79

## ✳ మాయిక వృత్తాంతము ✳

(వ. అనిన, మాయిక తన వృత్తాంతము నిట్లు వివరించుచున్నది:) 80

ద్విపద. వినవమ్మ! రాధ! నా - వృత్తాంతమెల్ల
ఎనలేని యింద్ర మ - హేంద్రజాలముల
సీమాటినై నేను - చెలఁగుచుండఁగను
కోమలి! యంతట - గుణహీనుఁడగుచు
మూలనున్నట్టి పా - ముల నక్కజోగి
బేలయై తొలి నన్నుఁ - బెండ్లిఁ జేసికొని
ఏలినట్లనె యుండి, - యెవతెనో దగిలి
చాలుగాఁ బెద్ద సం - సారంబుఁ జేసి
ఘనమైన నాల్గు కు - క్కలఁ దెచ్చి సాఁకి
వనఁబోణి! యది జీవ - నంబు చేసికొని
యున్నంతలోఁ, జాల - యుక్తులు చేసి
సన్నసైఁగలతోను - సారమేయములు
సవతితో నా మీఁదఁ - జూడి [30]చెప్పఁగను
శివమెత్తి యది జోగిఁ - [31]జీలఁదీసికొని
వేఱు బోదామని - వేధింపఁగాను

30. చెప్పినను – క. 31. చిల్లఁదీసికొని – క.

గారడి జోగి కు - క్కలను ఛేదించి
పనిఁబూని యవి రెండు - పాళ్లుగాఁ జేసి
తనువులు నాతట్టు - తగఁ బంచి యిచ్చి,
యనఘులై తలలు తా - మాక్రమించుకొని
మనసొచ్చినట్ల పొ - మ్మని నాకుఁ జెప్పి
కుదురుగా నిరువురు - గూడి, యందుండి
విదితంబుగా నన్ను - వెళ్లఁ గొట్టినను,
తడయక కుక్కల - తనువులు దెచ్చి
విడిబడి యందందు - విక్రయింపుచును
కడ్డాయములు చేసి - ఖలులను గూడి
గుడ్డిబిడ్డలఁ గని - కూపానఁ ద్రోసి
మేటిగా నపుడొక్క - మేకను బట్టి
పాటవంబున నేను- బంధింపఁ, జూచి
అపుడు మేకకును తా - నడ్డంబు వచ్చి
కుపితురాలని నన్నుఁ, - గోఁతిఁ బట్టుకొని
గట్టిగాఁ దనయొద్దఁ - గట్టివేసికొని
చుట్టాలకెల్ల నా - శోధ నంటించి
యూరకె తన యొద్ద - నుంచుకయుండి
యీ రాత్రిఁ దెచ్చి న - న్నీ యరణ్యమున
విహరించుమని చెప్పి - వృక్షాగ్రమెక్కి,
బహుసూత్ర మొక్కటి - పన్ని, నా మెడను
దగిలించి, యెక్కడఁ - దర్లిపోనీఁడు;
మగువరో! నా పేరు - మాయిక యంత్రుడు.

వ. అనిన విని, రాధ తనలో నగుచుఁ, గార్యార్థియై యేమి యనక, మందసఖ్యంబుగా నేమనుచున్నది: 81

**దరువు, మధ్యమావతి రాగం - ఆది తాళం, రెండవ కాలం**

నందనందనుడు నేఁడూ - నవ్వులాకు డాఁగినాఁడు
ఎందున్నాఁడో తెలియదు, నే - నేమి సేతునే? ౧

చిన్ని గోపాలుఁడు చేసే - చిన్నెలు, వన్నెలు నాదు
కన్నులాకుఁ గట్టిన రీతి - గానే యున్నాదే! ౨

మదిరాక్షి! శ్రీతరిగొండ - మనుజకంఠీరవు నీ వేళా
సుదతి! [32]యెందైన నీవు - చూడలేదటే? ౩

క. అన విని మాయిక రాధను
గనుఁగొని 'యతఁ డెట్టివాఁడు? క్రమమంతయు నీ
మనసున దాఁపక తెల్పుము
విని, చెప్పెద నీకు వాని వివరము రాధా!' **82**

## ✳ బాలకృష్ణుని స్వరూపము ✳

వ. అనిన విని, రాధ యిట్లనుచున్నది: 83

సీ. నీల నీరదమును బోలు దేహమువాఁడు
రమణీయ హేమాంబరంబువాఁడు
తేటైన పింఛకిరీటంబు గలవాఁడు
నవరత్నమయ భూషణములవాఁడు

32. యందెందైన - క.

వనమాలికాయుక్త వక్షఃస్థలమువాఁడు
ముసిముసి నవ్వుల మోమువాఁడు
కమలోపమంబులౌ కన్నులు గలవాఁడు
చొక్కించి కాంతలఁ జూచువాఁడు

తే.గీ. మోహనంబైన ముద్దు కెమ్మోవివాఁడు
చెల్వమున వేణునాదంబుఁ జేయువాఁడు
ధీరుఁడై యెప్పు డిచ్చోటఁ దిరుగువాఁడు
జూటువిటకాఁడు నన్నేలు నీటుకాఁడు. 84

## ✳ నక్కజోగి యాకృతి ✳

వ. అనిన విని, మాయిక తన నక్కజోగి రూపరేఖావిలాసంబు వినుమని యిట్లనుచున్నది: 85

సీ. పొలుపొందఁ గొంగనుబోలు దేహమువాఁడు
గొప్ప కళాసంబుఁ గప్పువాఁడు
తలమీఁదఁ గుందేటి తనువుఁ దాల్చినవాఁడు
పెద్ద యెముకల నొప్పు పేరువాఁడు
కాకి గుంపులనెల్లఁ జేకొనియెదువాఁడు
మించిన పాము నాడించువాఁడు
తెగువగాఁ బందినిఁ దెగవేసినట్టివాఁ,
డింటింట బిచ్చంబు లెత్తువాఁడు

తే.గీ. ఆఁడుదానికి లోఁబడినట్టివాఁడు
లేశమైన స్వతంత్రంబు లేనివాఁడు

తిండికే లేని కడు పరదేశివాఁడు
మూఁడు విడిచినవాఁడు మా ముసలివాఁడు. **86**

((వ. అనఁగా విని, రాధ యిట్లను చున్నది:) 87

క. మీ ముసలివాని రూపము
భామిని! విన్నపుడె చెవుల పండువు లాయెన్;
నా ముద్దు బాలకృష్ణుని
సేమం బిఁకనైన నీవు చెప్పవె! తెలియన్. **88**

## ✳ మాయికవలన బాలకృష్ణుని యునికి తెలియుట ✳

(వ. అనఁగా విని, మాయిక యిట్లు పల్కుచున్నది:) 89

తే.గీ. చెలియ! నే వాని సేమంబుఁ జెప్పఁగలనె!
ఇంత తడవును మితిలేని యిందుముఖులఁ
గూడి యిందుండి, యిప్పుడా కొలనుకడకుఁ
బోయి వేడుక నున్నాఁడు పువ్వుఁబోణి! **90**

వ. అనిన విని భీతిల్లి, రాధ యిట్లనుచున్నది: 91

### * *దరువు - ఆదితాళం, నాలుగవ కాలం*

ఏమేమే! యిచటికి వచ్చిన - యింతులు యెవరే? కొమ్మా!
ఆ యింతులు యెవరే? కొమ్మా! ౧

ఏమని చెప్పుదు? మీమందను గల - రామలేనె! వో యమ్మా!
ఆ రామలేనె! వో యమ్మా! ౨

* రాధా మాయికల సంభాషణ మిందు కలదు.

ఇంతిరో! గోపిక లింతకు వచ్చిరి - యేమనవచ్చునె? కొమ్మా!
యిఁక నేమనవచ్చునె? కొమ్మా! ౩

క. అని యిట్లు చింత సేయుచు
మనమున హరిఁ దలఁచుచున్న, మన్మథుఁ డాలో
ఘన సుమ సాయకములు గొని
తనువున నాటించె రాధ తల్లడమందన్. 92

## ✳ రాధ మన్మథ తాపము ✳

వ. అప్పుడు మోహావేశంబున మాయికతో నిట్లనుచున్నది: 93

### దరువు - ఆది తాళం, మొదటి కాలం

ఏ నేమి సేతు నమ్మా? ॥పల్లవి॥

కృష్ణుఁ డెంతెంత జేసె నమ్మా! ॥ఏ నేమి॥ ఉపపల్లవి॥

శుకపిక రవములు - తకపికలైనను
కకవిక లాయెను - గద నా హృదయం ॥బే నేమి॥ ౧

ముమ్మరమగు విర - హమ్మునఁ బొరలఁగఁ
దుమ్మెద గుంపులు - ఝుమ్మనసాగిన ॥వే నేమి॥ ౨

తుంటవిల్తుఁ డతి - కంటకమున ననుఁ
గంటి ననుచు గఱు - లంట సేసె నిపు ॥డే నేమి॥ ౩

చిన్నతనంబున - నన్ను రమించిన
మన్నన నేటికి - మఱచెను మాధవుఁ ॥డే నేమి॥ ౪

కొంకక శ్రీతరి - గొండ నృసింహుండు
పంకరుహాక్షుల - పాలాయెను మతి ॥నే నేమి॥ ౫

## దరువు - ఆట తాళం

ఇటువంటివాఁడని - యెఱుఁగకపోతినో యింతులారా!
నేఁడు, కటకటా! నన్నెంత - కన్నడ జేసెనో కాంతలారా! ౧

అయ్యయో! నా పుణ్య - మింతె కాఁబోలు నో యమ్మలారా!
ఇంక, కుయ్యో! [33] మొఱ్ఱింటయినఁ - గోరకపోతినే! కొమ్మలారా! ౨

తరిగొండ నరహరి - దయయుంచీనని యుంటిఁ దరుణులారా!
ఇప్పు, దరుదూగ మరుని పా - లైతిని తెకతేర కతివలారా! ౩

తే.గీ. వాని తేలింపుఁ జూపులు, వాని వగలు
వాని సంభాషణలు, వాని వైనములును
వాని రతికేళి వింతలు వనజనేత్రి!
మఱువఁగూడదె! జన్మజన్మములకైన. 94

## దరువు - అట తాళం

తాళ శక్యము గాదె! అమ్మా!
యింక, తాళ శక్యము గాదె! అమ్మా! ॥పల్లవి॥

తాళ శక్యము గాదె! - తరుణిరో! మదనుఁ డీ
వేళ నేయుచునుండె - విరులా ముల్కులచేతఁ॥దాళ॥ ఉపపల్లవి॥

---

33. మొఱ్ఱో + అంట + అయిన - అని పద విభాగము. 'మొఱపెట్టి యైనను'- అని యర్థము.

ఎంతెంత పనిఁ జేసిరే! కృష్ణునిఁ జేరి
-యెట్లు మాలిమిఁ జేసిరే!
వంతకారులు వన్నెవాసి విడిచి వచ్చి
-సంతసమున నాతో సాటైనందుల కింకఁ ॥దాళ॥ ౧

నా పొందు విడనాడెనే! వాఁ డిపు డల్ల
-నళినాక్షులను గూడెనే!
ఈ పట్లఁ దమతమ కాపురములు వీడి
-పాపజాతులు నాతో ప్రతిఘటించుటాకుఁ ॥దాళ॥ ౨

నయమున బేలించిరే! మాయలు చేసి
-నా పొందు మఱపించిరే!
దయలేక తరిగొండ ధాముఁడు తరుణుల
- వయసు వగలు చూచి వలలోఁ జిక్కెను గన్క ॥తాళ॥ 3

ఉ. తాళఁగరాదు మన్మథుని దారుణసూనశరాళి మీఱి యీ
వేళ నురంబునం దగిలి వీఁపునఁ దేలఁగఁ, దారకాధిపో
ద్వేల కృశాను తాపమున దేహము దీనత నొందెఁ, దుమ్మెదల్
మేళము సేయఁగాను తుద మించెను మోహ, మిఁకేమి సేతునే? 95

## దరువు - అట తాళం

ఏమి సేతునే? భామా!
ఇఁక నే నేమి సేతునే? భామా! ॥పల్లవి॥

ఏమి సేతునే? భామా! యీ వేళ నా భ్రమ
రామసోదరుఁ డిందు - రాక దీర, దిందు కే
॥నేమి సేతునే? భామా!॥ ఉపపల్లవి॥

ఎంత మోసము వచ్చెనే? వాఁడిపు డల్ల
-ఎలనాఁగలను మెచ్చెనే!
అంతరంగమున నా చింత లేక పర
- కాంతల లాలించి కవగూడినందు కే ॥నేమి॥ ౧

మంచివాఁడని యుంటినే! నేటికి వాని
-మాయ లన్నియుఁ గంటినే!
వంచించి, మితిలేని చంచలాక్షులఁ గూడి
-పంచశరుని బారిపాలు చేసెను నే ॥నేమి॥ ౨

నను బాయఁడని యుంటినే! శ్రీతరిగొండ
-నరహరే పతి యంటినే!
చెనటు లి ట్లేమేమొ చెప్పి నామీఁదాను
-మనసు విఱిచి యింత మాయఁ జేసి,రందు ॥కేమి॥౩

ఉ. ఏమిఁకఁ జేతునే? చెలియ! యెంతటి చింతకు మూలమాయెనే!
ఈ మధుసూదనుం గలియ నెందుకు [34]ముందుగ రాకపోతినే?
నే మును వచ్చియున్నఁ దరుణీమణు లిక్కడి కెట్లు వత్తురే?
తామసనిద్ర వచ్చి ననుఁ దాపముఁ బొందఁగఁజేసె నయ్యయో!96

**దరువు - అట తాళం**

ఎంత మోసమాయె నయ్యో! - యేమి సేతునే? ॥పల్లవి॥
సంతతాము వచ్చే రీతి - సంధ్యవేళా రానందుకె
ఎంత మోసమాయె నయ్యో! - యేమి సేతునే? ॥ఉపపల్లవి॥

34. తొల్తనె - అ, ముందుగ - క.

మాయగా వాఁ డింతా పని - చేయఁగా, నా పొద్దిట్లీడఁ
బాయెఁగా! కాయజు తాప - మాయెఁగా! దోయమ్మా! జెల్లా!
॥ఎంత॥ ౧

తా ముందు నా మానమునకు - ఖామందుగా నుండి, యిప్పు
డా మందు మారులఁ గూడె! - నేమందు? నో యమ్మా! జెల్లా!
॥ఎంత॥ ౨

అక్కయా! గోపస్త్రీలాదె - నిక్కాయా! వారికి వాఁడే
దిక్కాయా, విడువరాని - చిక్కాయా, నో యమ్మా! జెల్లా! ॥ఎంత॥ ౩

నిందకూ వొడిగట్టి, వాఁ - డిందుకూఁ జొచ్చినప్పుడె
పొందుకూ నే నాసపడే - దెందుకే? వోయమ్మా! జెల్లా!॥ఎంత॥ ౪

నమ్మితీ శ్రీ తరిగొండ - నారసింహుఁడనీ వానీ
ఇమ్మహీ [35] మాయాదారని - యెఱుఁగానే! వోయమ్మా! జెల్లా!
॥ఎంత॥ ౫

ఉ. నమ్మికగాను శౌరి విడనాడఁడు నన్నని యుంటి, వాఁడు నా
సొమ్మని యుంటి, నెన్నఁ డొక చోద యెఱుంగక యుంటిఁ జాల నే
నెమ్మది నుంటి, మాధవుఁడు నీతిపరుండని యుంటి; నేటికిం
ద్రిమ్మరి గోపికల్ హరినిఁ దేరగఁ జేసిరి చూడు మాయికా! 97

35. మాయదారి + అని - అని పద విభజనము.

## ✳ రాధిక మూర్ఛ - చెలుల శైత్యోపచారములు ✳

వ. అని పలికి, చెలుల నందఱం జూచి యిట్లనుచున్నది: 98

**దరువు - ఆది తాళం, నాలుగవ కాలం**

చూడరె! మదనుని - వేఁడి శరములకు
పోఁడిమిఁజెడి యిటు - వాడితిఁ గదరే! వో యమ్మలారా! ౧

అళిబలములఁ, జిలు- కల కలరవములు
పలుమఱుఁ జెలఁగఁగ - సొలసితిఁ గదరే! వో యమ్మలారా! ౨

శ్రీతరిగొండ నృ - సింహునిఁ జూడక
యీ తాపము పోదిఁక- దరి యేమే? వో యమ్మలారా! ౩

ద్విపద. ఏ నేమి సేతునో - యేణాక్షులార!
మానసజాతుని - మార్గణహతికి
సారమౌ జలజారి - చంద్రికాతతికి
సారంగములు సేయు - సంగీతములకుఁ
గలకంఠ, శుకబృంద - కలకలంబులకు
మలయానిలుఁడు మాఱు - మసలినందులకు
నీలకంఠమ్ముల - నృత్త లీలలకు
నీలాగు విరహాగ్ని - హెచ్చినందులకు
రామసోదరుఁ డిందు - రాక తా నిల్చు
టేమని చెప్పుదు? - నెట్ల సైరింతు?
కటకటా! నా వంటి - కష్టాత్మురాలి
నిటువలెఁ బుట్టించె - నేలకో బ్రహ్మ?
సరసీరుహాక్షి! నా - చక్కఁదనంబు

తెఱఁగొప్ప గగన చం - ద్రిక విధంబయ్యె.
ఇన్నాళ్లు నా రాక - కెదురు చూచుకొని
యున్న ప్రాణేశ్వరుఁ - డూరక నేఁడు
నా జోలి లేక యు - న్నందుల కిప్పు
డీ జాలిచేత నే - నెట్ల సైరింతు?
నని యిట్లు చింతించి - 'హా కృష్ణ!' యనుచు
మొనసి రాధిక వేగ - మూర్ఛిల్లి పడియె.

వ. ఆ సమయంబునఁ జెలులు శైత్యోపచారంబులు చేసే విధం బెటు
నలెను. 99

సీ. పొలఁతికి విరహాగ్ని పొడమె నీ తతిఁ జాల
చల్లఁగాఁ బన్నీరు చల్లరమ్మ!
పారిజాతంబుల పాన్పు మీఁదికినైన
నుపమగాఁ గొని చని యుంచరమ్మ!
పరిమళగంధంబు పొలిండ్లపైఁ బూసి
విరుల వీవనలచే విసరరమ్మ!
పొలుపొందఁగా జాజిపూల బంతులతోను
మెత్తఁగాఁ గనులపై నొత్తరమ్మ!

తే.గీ. అనుచు రాధిక నీ రీతి నాదరించి
చెలులు శైత్యోపచారముల్ చేయఁగాను
మోహనాకార యంతలో మూర్ఛఁ దెలిసి
యేమి తోఁచక సఖులతో నిట్టులనియె: 100

### దరువు - ఝంపె తాళం

ఇదిగోనె! సఖులార! - యీ రాత్రి దినకరుఁడు
ఉదయమై నడి మింట - నున్నాఁ డదేమే? ౧

ఎడతెగక కాఁచేటి - యీ యెండలో నన్ను
నుడుకు పువ్వులమీఁద - నుంచినారేమే? ౨

వెఱవకను సురటులను - విసరి మీ రీరీతి
నురు విరహశిఖి నేల - హుతముఁ జేసేరే? ౩

భావజానలమె నా - పై నిండియుండఁగా
ఈ వేడిగంధ మిపు - డేల పూసితిరే? ౪

ఏ నెవ్వ? రీవేళ - నెచ్చోట నున్నాము?
మీనలోచనలార! మీరెవ్వరమ్మా? ౫

తే.గీ. 'తరళలోచన! యిదియె బృందావనంబు,
నీవు రాధవు, చెలులమే నీకు మేము,
పండువెన్నెల యిది గాని, యెండ గాదు,
కలవరంబేల? మానవే! కంబుకంఠి!' **101**

వ. అని చెలులు తెలిపినఁ, దెలిసికొని యిట్లనుచున్నది: 102

## ✳ రాధ మేల్కని, హరి పూర్వలీలలను దలంచుట ✳

### దరువు, ఆహిరి రాగం - ఆది తాళం, నాలుగవ కాలం

హేలావతులాఁ గూడి కృష్ణుఁ డిందు
రాఁడాయెను గదరే! కొమ్మలారా!

అల్ల, బాలాగోపాలుని యెడఁబాసి నేను
తాళలేనే! కొమ్మలారా! ౧

మారుని సుమనారాచములు
మననియ్యవే! ధరణిమీఁద కొమ్మలారా!
ఇఁకను, మీరు నాపై ఆస విడిచి
మీ యిండ్లలోఁ జేరుకోరే! కొమ్మలారా! ౨

తరిగొండా నరసింహునికీ నా
తనువే యర్పించియున్నానే! కొమ్మలారా!
వాని, చరణారవిందమరంద
సారములోఁ గలసెదనే! కొమ్మలారా! ౩

వ. అని పలికి, హరి పూర్వలీలలు దలంచి మాయికతో నిట్లనుచున్నది: 103

సీ. ఇన్నాళ్ళు నారాక కెదురుచూచుచునుండి
వచ్చినప్పుడె కౌఁగి లిచ్చునమ్మ!
ఇచ్చి నా కళలంట నెంతొ మెల్కువగాను
విరుల బంతులు గొని వేయునమ్మ!
వేసి, చక్కిలిగింత చేసి తేలింపుచు
ననుఁ జూచి చిఱునవ్వు నవ్వునమ్మ!
నవ్వి, పాలిండ్లపై నఖములు నాటించి
మోవి తేనియలాని మురియునమ్మ!

తే.గీ. మురిసి, మన్మథకేళికి మొనయునమ్మ!
మొనసి పెనఁగుచుఁ బలుమాఱు చెనకునమ్మ!
చెనకి యానందమూగ రతిఁ జేయునమ్మ!
చేసి తాఁ జొక్కి, నాచేతఁ జిక్కునమ్మ! 104

వ. అని యిట్లు హరి పూర్వలీలలు దలంచు సమయంబున, మన్మథుండు చెలరేఁగి సేనను పురికొల్పి బాణవర్షంబుఁ గురిపించినఁ, గోపాటోపంబున నిట్లనుచున్నది: 105

## ✳ మన్మథ, చంద్ర, మలయానిలులను దూషించుట ✳

### *దరువు - అట తాళం*

ఎంత పాపకర్మి వయ్యో! పంచబాణా!
న, న్నెందు కిట్లా యేఁచేవుర? పంచబాణా! ౧

భామ లుసూరుమంటె నీకు పంచబాణా!
పాపమయిన [36] వెఱవవేమిర? పంచబాణా! ౨

అమితమైన నీదుసేన పంచబాణా!
కా, అడవి పాలైనఁ గాదటర? పంచబాణా! ౩

తే.గీ. నీదు కోదండ కఠినత నీరుగాను!
వాఁడి బాణము లెండచే వాడిపోను!
తెల్లవాఱఁగ నీ శక్తి త్రెళ్లిపోను!
పోర! మన్మథ! నీ రూపు భూతిగాను! 106

---

36. రాదేమిర? – అ, వెరవవేమిర? – క.

### దరువు - అట తాళం

విస్తరిల్లె నీదు కళలు నీరజారీ!
యింత, వేఁడికి నేఁ దాళలేరా! నీరజారీ! ౧

దినకరుఁడు తన వేఁడి నీరజారీ!
నీలోఁ దిరముఁజేసి పోయెనఁటర? నీరజారీ! ౨

జలదమైనను జారదా? నీరజారీ!
నాకు, సైఁపధురా! నిన్నుఁ జూడ నీరజారీ! ౩

తే.గీ. నీదు మేనఁ గళంకంబు నిలిచియుండి,
భూమిలో లేని నింద నిన్ బొందియుండి,
పర్వమందును నినుఁ బాము పట్టుచుండి,
ఇంక నీ గర్వ ముడుగదా? పంకజారి! 107

### దరువు - అట తాళం

ఎందుల కిట్లాయెఁ? జెప్పరా! మలయమారుతా!
ఇప్పు, డిందునా ఫలమేమిరా? మలయమారుతా! ౧

వేళగాని వేళవచ్చి మలయమారుతా!
నీ, విరివి నాకుఁ జూపవలెన? మలయమారుతా! ౨

మదను తోడు వీడరాదా? మలయమారుతా!
నీ, మంకుబుద్ధి మానరాదా? మలయమారుతా! ౩

తే.గీ. మించి పాములు నినుఁబట్టి మ్రింగఁగాను
పొంచి గగనంబు నిన్ను హరించఁగాను
దివ్యయోగులు లోనె బంధింపఁగాను
నీ బలంబేల యుడుగదో? నీచపవన! 108

వ. అని యిట్లు మన్మథ, చంద్ర, మలయానిలుల దూషించిన, విని చెలులు న్యాయంబుగా నిట్లనుచున్నారు: 109

## ✻ చెలుల ధైర్యోక్తులు ✻

క. మారుఁడు, మారుతమును, జల
జారియు నిన్నేఁచిరనుచు సంకటమేలన్?
ధీరత నీ యెడఁ గల్గిన,
వారలు నిన్నేమిసేయువారలు సెపుమా? **110**

క. ధైర్యమున నెవరికైనను
కార్యము సిద్ధించుఁగాని, కకవికలైనన్
కార్యంబు విఫలమౌనని
యార్యులు చెప్పుదురు నీతు [37]లనిశము రాధా! **111**

వ. కావున, ధైర్యంబునఁగాని కార్యంబు సాధింపఁగూడదు. హరి సాహాయ్యంబునఁగాని శత్రునిగ్రహంబు గానేరదు. నీ రాక యతని కెఱింగించిన, రాక నిరాకరింపఁడనిన, విన్ని రాధ మాయికతో నిట్లనుచున్నది: 112

### దరువు - ఆది తాళం, నాలుగవ కాలం

హరి సహాయ మైతె గాని - యరుల గెల్వ రాదైతే, శ్రీ
హరి వచ్చేటందుకు మన - మే మలుపుఁ జేతామే? ౧

అచ్చట నందతిఁ గూడి - ముచ్చటలాడే గోపాలుఁ
డిచ్చటికిఁ బిలిచితేనే - వచ్చు నటవే? ౨

37. లనయము రాధా! - క.

మంచి, దైతె యిందు కేమి, – మర్యాదకైనాను మనకు
చంచలాక్షి! యింక నొక్క – జాడ యున్నాదే! ౩

నయభయములుగా నీవు – నా రాక తెలియఁజేసి
ప్రియముగానె రమ్మనుచుఁ – బిలిచి చూడవే! ౪

ప్రేమ యుంటె తరిగొండ – ధాముఁ డిందు రాకపోఁడు
కోమలి! యిందైన వాని – గుణముఁ జూతామే! ౫

### దరువు - అట తాళం

అడిగిరావె! పోయి మాయికా! ॥పల్లవి॥

నీవు, తడయక తరిగొండధాముని [38]యీ మాట
అడిగిరావె! పోయి మాయికా! ॥ఉపపల్లవి॥

మదిలో మున్పటి మోహముంతునో? లేక
మఱచి విరక్తి వహింతునో?
మదనుని దుడుకులకు సహింతునో?
లేక, మార్కొని నిలిచి జయింతునో? తెలియా॥నడిగి॥ ౧

అంగసుఖములు చింతింతునో? హా! పర
సుఖమును భావింతునో?
శృంగారకథ లాలకింతునో? లేక
చిరతత్త్వ కథలు శోధింతునో? తెలియా॥నడిగి రావె!॥ ౨

ఎదలో నాపై ప్రేమ మఱచీనో? నాటి
యిష్టమేమైనాను దలఁచినో?

38. యీ వేళ – క.

మొదటి ప్రమాణము విడిచీనో? లేక
మునుపటివలె వచ్చి నడచీనో? తెలియా ॥నడిగిరావె!॥3

వ. అనిన విని మాయిక యిట్లనుచున్నది: 113

క. భయమున నిప్పుడు కార్యము
జయమగునని చూడవలదు; సంతత సచ్చి
న్మయుఁడైన కృష్ణమూర్తినిఁ
బ్రియముగఁ బిలిపింపుమమ్మ! బిసరుహనయనా! 114

## ✳ మాయిక దౌత్యము ✳

వ. అనిన విని మాయికను జూచి రాధ యిట్లనుచున్నది: 115

ద్విపద. మాయిక! నీవు స - మ్మతిని మత్ప్రాణ
నాయకు తోడుత - నమ్రతగానె
నలువంద బాల్యంబు - నాఁడు వేడుకల
నిల సాక్షిగాను తా - నిచ్చిన మాట
నేటికి మఱచె, నీ - నీతిఁ గాదనుము
పాటిలేకను గోప - భామలనెల్ల
తగిలియుండుట యుచి - తంబు గాదనుము
నగుఁబాటుఁ బొంద కా - నళినలోచనల
నందుండి యిండ్లకు - నంపించుమనుము
నిందల కొడిఁగట్ట - నీకేల? యనుము
నీ వీ విధంబున - నీతిగాఁ బల్క
నా వనరుహనాభు - దది సత్య మనుచు
విని వచ్చెనా సరె, విని రాక యున్నఁ

దనకే సమర్పింతుఁ- దనువు వేవేగ
యని నేను పల్కితి - నని నీవు పల్కు
మని, వ్రేలి యుంగర - మానవా లిచ్చి
'పోయిర' మ్మనఁగ న - ప్పుడు ముదమంది
మాయిక చని పల్కె - మాధవుతోడ.

## ✳ మాయిక శ్రీకృష్ణునిఁ బ్రార్థించుట ✳

### త్రిపుట

దండమయ్యా! నీకు హరి! వే - దండవరదా! రాధిక
దండమిదె గైకొనుము - దానవ దండపాణీ! ౧

వనితలును, నీ వెలమి నిచటికి - వచ్చినప్పుడె ముదమునా
వనజలోచన రాధ యచటికి - వచ్చెనయ్యా! ౨

నిన్నుఁ బిలుచుక రమ్మనుచు మా - నీలవేణీ యిచటికీ
నన్నుఁ బంపెను రమ్ము వేగమె - నళిననయనా! ౩

వ. అనిన విని హరి మాయికనుజూచి నగుచు, గోపకాంతలకుఁ బ్రియంబుగా నిట్లనుచున్నాఁడు: 116

తే.గీ. వినవె మాయిక! యీ గోపవనితలెల్లఁ
జెలఁగి సర్వోపచారముల్ చేయఁగాను
ఇంతకన్నను రాధ నా కెక్కువేమి?
ఇపుడు రానని తెల్పుమా! యిందుముఖికి. 117

వ. అనిన విని, మాయిక యిట్లనుచున్నది: 118

ద్విపద. వినవయ్య! శ్రీకృష్ణ! - విశదంబుగాఁగ
ఎనసి యీ కామిను - లెంద ఱుండినను,
మాధవ! నీ వెన్ని - మాటలాడినను,
రాధకు సాటిగా - రాఁబోరు వీర;
లా చూపు, లా వగ, - లా వయారంబు,
లా చెల్వ, మా ముద్దు, - లా వినోదంబు,
లా సరసోక్తులు, - నా జాణతనము,
లీ సారసాక్షుల - కెందుకుఁ గల్గు?
నది యెట్ల నంటె ని - య్యవనిమీఁదటను
మదయుక్త కరిణికి - మహిషీ వితతికి
నుపమింపఁదగునె? యే-యుక్తిఁ జూచినను,
విపుల సద్గుణశీల! - వీరినిఁ జూచి
యీ విధంబున భ్రమ - లేల పొందెదవు?
రావయ్య! పోదాము - రాధ చెంతకును.

## ✳ గోపకాంతలు మాయికతో వాదించుట ✳

వ. అని యిట్లు రోషంబు లాడిన మాయికను జూచి గోపకాంత లిట్లను చున్నారు: 119

తే.గీ. వినవె మాయిక! వగకత్తె! వింతలాడి!
ఎదురు లేరని పల్కితి - వివ్విధమున,
నీకు, రాధకు సాటైన నెలఁత లింకఁ
గలుగనేర్తురె? మూఁడు లోకంబులందు. 119

## దరువు - అటతాళం

పోవె! పోవె! నీవు మాయికా!

నీ, పోసారము లేమె? మాయికా!

ఈ వేళ ని న్నిచ్చకములు పల్క

నెవ్వారు పిలిచిరె? మాయికా! ౧

గడుసరివే నీవు మాయికా!

యెంత, గర్వించి తిరిగేవె? మాయికా!

మడియతనమున ఈ మాటలంటి వీవు

మాకేమి గణ్యమె? మాయికా! ౨

పక్షపాతముగాను మాయికా! యిట్ల

పలికితివైనాను మాయికా!

శిక్షించే మిపుడే శ్రీతరిగొండన్ృ

సింహుఁడు చూడఁగాను మాయికా! ౩

(వ. అనఁగా విని మాయిక యిట్లనుచున్నది:) 121

ఆ.వె. చెనటులార! నన్ను శిక్షింతుమంటిరి

గాని, హెచ్చు పెచ్చు గానరైతి;

రిట్టి వింతమాట లేమిటి కిఁక నాకుఁ?

బోరె! పోరె! చాలుఁ బొలఁతులార! **122**

వ. అని యిట్లు గోపకాంతల ధిక్కరించి పలుకుచున్న మాయికను బిలిచి, హరి యిట్లనుచున్నాడు: 123

### * జంపె

ఏమె మాయిక! యిచట నే నుండఁగాను ,నీ
కీ మగువలతో మాట - లేల? యిటు రావే! ౧
ఈ వెలఁదులతో మాటలేల - యిఁక, నైతేను
రావయ్య! పోదాము - రాధ చెంగటికి,
అందుండి రాధ ని - న్నంపించు సమయమున
నిందీవరాక్షి న - న్నేమనియె? చెపుమ!

(వ. అనిన, మాయిక యిట్లు పల్కుచున్నది:) 124

### ✳ రాధాదేవి సందేశము ✳

సీ. అందుండి రాధ నన్నంపింపఁగాఁ బూని
'యిందు ర'మ్మని పిల్చి యిట్టులనియె:
లలితమైనట్టి బాల్యస్నేహ మీవేళఁ
దప్పవద్దని నీతోఁ జెప్పుమనియె
ఈ కాంతలను దన యెదుటికిఁ దోడ్తేక
యతివేగమే యింద్ల కంపుమనియె
ఒక్కఁడవే వచ్చి, యొనరంగ నిఁకఁ దన
యుక్తి గ్రహించేది యాఱటనియె

తే.గీ. నటుల సేయకయున్నఁ, దా నా క్షణమునఁ
దనువు నీకె సమర్పింపఁదలఁచి యిప్పు
డతిధృఢంబుగనే యున్న దబ్జనేత్రి;
ఏమి చెప్పుదు నిఁక మాట? లిందిరేశ! 125

*ఈ జంపె మాయికా, కృష్ణుల సంవాదాత్మకము.

వ. అనిన విని, మాయికతో నిట్లనుచున్నాడు: 126

మ. చెలియా! నేను నిరంతరంబు మదిలోఁ జింతింపుచున్, మెచ్చుచున్
కలనైనన్ విడనాడలేక తననే కామించి భోగింపఁగా,
నలఘుత్వంబున గోపసుందరులతో నన్యోన్యమై యుండకన్
చెలి యిట్లెందుకుఁ జేయఁబూనినది? నా సఖ్యంబుఁ బాటింపకన్. 127

## ✳ బాలకృష్ణుఁడు గోపికలతోఁగూడి రాధకడకు వచ్చుట ✳

ద్విపద. అని యిట్లు పల్కి చి - దానందమూర్తి
తనమదిలో రాధ - తాపంబుఁ దీర్పఁ
దలఁచి వేడుకతోడఁ - దరుణులఁ గూడి
యలఘు జలక్రీడ - లాట చాలించి
నవ్యాంబరంబులు - నవ్యమాల్యములు
నవ్యగంధంబులు - నవ్యభూషణము
లమరఁగా ధరియించి - యబ్జాయతాక్షుఁ
దమితమౌ సతులతో - నచ్చోటు వెడలి
చుక్కలతో వచ్చు- సోముఁడో యనఁగ
నక్కఱతోఁ గాంత - లందఱు గొల్వ
మాధవుఁ డప్పు డా - మాయిక తోడ
రాధఁ జూచుట కను - రాగంబు గల్గి
వచ్చి, తత్పూర్వ ని - వాసంబుఁ జేరి
మచ్చికతోడ న - మ్మదనగురుండు
కామిగాకనె యుండి - కామిచందమునఁ
బ్రేమతో రాధను - బిలిచిన, వచ్చి

ప్రతిభాష లాడక - పంతంబు మించి
యతివ తరుచ్ఛాయ - లందు డాఁగినను
చూచి, చూడని రీతి - సూర్య,శశాంక
లోచనుఁ డప్పు డా - లోలాక్షి రాధ
నచ్చటచ్చటను మో - హావేశమునను
విచ్చనవిడిగాను - వెదకుచు వచ్చి
యెందుఁ గానని రీతి - నిందిరాధీశుఁ
డందాడుచున్న రా - యంచల కనియె:

## ✳ శ్రీకృష్ణుఁడు రాధను వెదకుట ✳

### *దరువు - ఆది తాళం, నాలుగవ కాలం*

రాధను జూపరుగా! రాయంచలారా! ॥పల్లవి॥
రాధను జూపరుగా! నా వయారి
రాధను జూపరుగా! రాయంచలారా! ॥ఉపపల్లవి॥
నా రాకఁ దెలుపరుగా! రాయంచలారా!
నా కలికి నిపుడూ నా చెంత నిలుపరుగా! ॥రాధను॥ ౧
ఈ కోర్కెఁ దీర్చరుగా! రాయంచలారా! మ
మ్మిరువురినీ యీవేళఁ గూర్చరుగా! ॥రాధను॥ ౨
ప్రియముఁ బుట్టించరుగా! రాయంచలారా!
తరిగొండ నరహరి పిలిచీని రమ్మనరుగా! ॥రాధను॥ ౩

వ. అని యిట్లు రాయంచల నడిగి, రాధను గని పట్టినఁ, బట్టు విడిపించుకొని పోవుచున్నఁ, బొలఁతినిఁ గని హరి మోహావేశంబునఁ బిలిచే విధం బెటువలెను. 128

## ✳ రాధాకృష్ణుల సంవాదము ✳

### దరువు - ఆది తాళం, నాలుగవ కాలం

రావే! ముద్దుల రాధా! - రావే! చక్కని రాధా! ౧
మధుకరవేణీ! రాధా! - మధురస వాణీ! రాధా! ౨
చిక్కులఁ బెట్టకె! రాధా! - చిక్కవె! చేతికి రాధా! ౩
కంజదళేక్షణ! రాధా! కౌఁగిలియ్యవే! రాధా! ౪
అంబుజపాణీ! రాధా! - అలిగెదేలనే? రాధా! ౫
నిన్నేమంటినె? రాధా! - నేరముఁ జెప్పవె! రాధా! ౬

వ. అని పలికి, బొంకించి కొంగొడిసి పట్టినఁ, బట్టు విడిపించుకోనేరక కోపించి యిట్లనుచున్నది: 129

### *దరువు - [39]ఆది తాళం

విడిబడి నీ వెను - వెంట వచ్చినవారు
చిడిముడిపడ నన్నుఁ - జేరి పట్టేదేల?
విడువరా! కొంగు విడువరా! ౧

కడలేని మోహము - కడు మించె నిప్పుడు
కడగంటఁ జూచి యె -క్కడ నీవు డాఁగిన
విడుతునా? నిన్ను విడుతునా? ౨

---

*ఈ దరువు మొదలుకొని "రాధ! నీ వెంతప్రొద్దుకు రాకయున్న"- అనే తేటగీతి పద్యము వరకు రాధాకృష్ణుల సంవాదము కొనసాగినది.

39. ఆట తాళం - క.

దుడుకు మాటలాడి - తొల్లింటి చందానఁ
బడుచుఁదనముఁ జేసి - పట్టక, నా కొంగు
విడువరా! కృష్ణ! విడువరా! ౩

ఇడుముల మాట లీ - విట్లాడినా, పొందు
విడిచేనఁటే? నిన్ను - వేరు చేసి, నేను
విడువనే! రాధ! విడువనే! ౪

తడయక తరిగొండ - ధామ! నీ వా గొల్ల
పడుచులనే గూడి - ప్రబలించితే చాలు!
విడువరా!- పైఁట విడువరా! ౫

తే.గీ. జలజలోచన! నీ మీఁది జాలిచేత
నిమిషమైనను నే నిందు నిదురలేక
సుమశరాసను దాడిచేఁ జొక్కినపుడు
నీవు నన్నిటు విడనాడ నీతె? రాధ! 130

తే.గీ. చాలుఁ జాలిఁక నిల్వరా! జాణతనము,
సుందరీమణు లందుండి సుమశరములు
నాటనిత్తురె? నీమేన నవ్యకైన,
నీ విచిత్రంపు బూటకంబేల? కృష్ణ! 131

**దరువు - ఆది తాళం, నాలుగవ కాలం**

మారుకేళి కిక్కడ నేఁ - జేరితిఁ గదవే? రాధా!
నేఁ జేరితిఁగదవే? రాధా!
చేరితివో, మీఱితివో, యే - మాఱితివో? నే నెఱుఁగా. ౧

ఈ చెలులతొ నీ వచ్చే దిటఁ - జూచితిఁగదవే? రాధా!
నేఁ జూచితిఁ గదవే? రాధా!
చూచితివో, యేచితివో, దయఁ - దాఁచితివో? నేనెఱుఁగా. ౨

ఇరవుగాను నే నీ కౌఁగిలె - మరగితిఁగదవే? రాధా!
నే మరగితిఁగదవే? రాధా!
మరగితివో, జరిగితివో, యెం - దరిగితివో? నేనెఱుఁగా. ౩

సమ్మతముగాను నే నీ - సఖ్యమె నమ్మితిఁగదవే? రాధా!
నెఱ నమ్మితిఁ గదవే? రాధా!
నమ్మితివో, గిమ్మితివో, మన - సమ్మితివో? నేనెఱుఁగా. ౪

ముచ్చటకై తరిగొండకు - వచ్చితిఁ గదవే? రాధా!
నే వచ్చితిఁ గదవే? రాధా!
వచ్చితివో, మెచ్చితివో, యే - మిచ్చితివో? నే నెఱుఁగా. ౫

వ. అని పలికి మఱి న్నిట్లనుచున్నది: 132

ఉ. దొంగతనంబుగాను పరతోయజనేత్రలఁ జేరఁబిల్చి, న
న్నంగడిఁబెట్టి, నిందలకు నాలయమై, మునుపున్న గోప్యమున్
భంగముఁజేసి నేఁడు బహుప్రాజ్ఞుఁడవైతివి; యింతె చాలు! నా
కొంగిపుడేల పట్టెదవు? గోపకుమారక! చాలుఁ దియ్యరా! **133**

*దరువు - ఆది తాళం, నాలుగవ కాలం*

ఓహోహో! యీ జార చోర
యుక్తులు సాధించి, మంచి
సాహసాము నేర్చినావు రా! గోపాలబాల!
జాణవైతి, వంతే చాలురా! ౧

జాణను నేనైతే, నీకే
సంతోషముఁ జేసేఁగాని
ఏణనయనా! కౌఁగిలియ్యవే! వయ్యారి రాధ!
యింక, కూహకాలు మానవే! ౨

కూహకత్వమూన నీతో
కొట్లాడితె తీరేదేమి?
దేహాసక్తి విడిచిపెట్టరా! గోపాలబాల!
తెలివియుంటె యింక బ్రదికే రా! ౩

దేహాసక్తి విడిచీ నన్ను
తేరఁజేసేదేల? నీవు
మోహమూన ముద్దుఁ బెట్టవే! వయ్యారిరాధ!
మూర్ఖబుద్ధీ విడిచిపెట్టవే! ౪

నీ చిత్తము తరిగొండ
నిలయ! నారసింహ! న
న్నేఁచే మాట లాడవద్దురా! గోపాలబాల!
యిపుడు నేనేమి ముద్దురా? ౫

## సీస దరువులు

సీసము. చిలుకల కొల్కి! నా చిన్ననాఁడే నీవు
మారతంత్రాసక్తి మరపినావు
సాహసయుక్తిచేఁ జౌసీతిబంధముల్
నీవె ముద్దులు చేసి నేర్పినావు
నీ యనురాగంబు నేఁడు విసర్జించి

దరువు. నన్నేల విడనాడేవే? నా కలికి రాధా!
నన్నేల విడనాడేవే?
నా కలికిరాధా! నన్నేల విడనాడేవే?
నే తాళలేనే! నాటి కరుణఁ జూడవే! ౧

సీసము. ఏలరా? గోపాల! యే నీకుఁ దగుదునా?
తఱచైన గోపసుందరులె గాని,
క్రొత్తగా ముత్తెముల్ కొల్లగా వచ్చిన,
నీ ప్రాఁతమాణిక్య మేల నీకు?
అక్కఱలేని మోహావేశమున నన్ను

దరువు. బొంకించేదేల? వద్దురా! వోచిన్ని కృష్ణా!
సొక్కించేదేల? వద్దురా!
వో ముద్దుకృష్ణా! సొక్కించేదేల? వద్దురా!
క్రియలేని వట్టి చోదాల నేమి గద్దురా? ౨

సీసము. కోకిలవాణి! యీ గోపకాంతలకు నే
నీ వేళకును కౌఁగిలియ్యలేదు,
నీ యనుమతి లేక నేనింత కార్యంబు
పూని చేసెదనను బుద్ధిలేదు,
ఇట మీఁద నీ వాజ్ఞ యేమి చేసినను నే

దరువు. నా రీతి నడిచేవాఁడనే! యెట్లైనాగాని
యా రీతి నడిచేవాఁడనే!
నిక్కముగా నే నా రీతి నడిచే వాఁడనే!
నీ సెలవు లేక ఆ యింతులను గూడనే! 3

సీసము. ఔరౌర! నీ వింత యభిమాన ముంచిన
నాకేమి కొదువరా? నళిననాభ!
అరమరలేల? మహారాజువలె వీరిఁ
బొంది నెమ్మది నుండు పురుషసింహా!
నీ యాస యెట్టిదో నీకె తెలియుఁగాని

దరువు. నేనేల వద్దనేనురా? హరి! హరి!
యిది నే నేల వద్దనేను రా?
నిష్ఠురముగాను నేనేల వద్దనేనురా?
శ్రీతరిగొండ నిలయా! యింక నీ మనసురా! ౪

క. నీ మనసిఁకఁ బొమ్మనుచును
కామిని! ననుఁ దేరఁ జేయఁగాఁదగునే?
ఏ మాట నీవు చెప్పిన
నా మనసుకు సమ్మతంబు నళినదళాక్షీ! 134

దరువు - ఆది తాళం

మంచిది నిలుపవోయి! గోపాలా! నీ
మాయమాట కేమి? గోపాలా! ౧

ఇంద టింతు లుండఁగ గోపాలా! నీ
కిపుడు నేను గావలెనా? గోపాలా! ౨

నే నెవ్వరు? నీ వెవ్వరు? గోపాలా! యింక
నే నీకేల తరిగొండ గోపాలా? ౩

**దరువు - ఆది తాళం, నాలుగవ కాలం**

వనరుహలోచన! నే నీ వాఁడనే! ॥పల్లవి॥

విను మెందఱున్న నిన్ను వీడనే! ॥వనరుహలోచన!॥ ఉపపల్లవి॥

చంచలాక్షి! నే నెంతో-మంచి మాటాడిన
నెంచక నన్నూ-దూఱేదేలనే? ॥వనరుహ॥౧

ఇంద ఱింతులు తమ్మూఁ - బొందమనిన, నామనసు
కుందరదనా! నిన్నే - కోరునే! ॥వనరుహ॥౨

నీలవేణి! నీ విట్లు - నెనరుగఁ జూడని
జాలిచే నేను - సైఁపఁజాలనే! ॥వనరుహ॥౩

చక్కెర కెమ్మోవి - నొక్కినా, నీ మనసు
చిక్కనీవు నే-నేమి చేతునే? ॥వనరుహ॥౪

గురుతరముగ తరి -గొండ పురములో నాఁడు
తరుణి! నీ కిచ్చిన మాట - తప్పనే! ॥వనరుహ॥౫

క. నీ వాఁడను నేననుచును
భూవర! పల్మాఱు నేఁడు బొంకఁగవలెనా?
నావాఁడవె నీవైతే
ఈ వెలఁదులఁ దెచ్చి సారె కేఁచుదువఁటరా? 135

తే.గీ. రాధ! నీవెంత ప్రొద్దుకు రాక యున్నఁ
దరుణి! నినుఁ గోరి వేణునాదంబుఁ జేయఁ,
దాము విని వచ్చి గోపికల్ భామ! నన్నుఁ
గోరి; రేనేమి చేతునె? కువలయాక్షి! 136

వ. అనిన విని, రాధ గోపకాంతలఁ జూచి, కోపించి యిట్లనుచున్నది: 137

## ✳ రాధ-గోపకాంతలు కలహించుచుట ✳

### *దరువు - అట తాళం

అతివలార! మీరు దంటలే! యెంత తుంటలే!
[40]యీ రాతిరి వేళా
పతుల నే రేతి బొంకిస్తిరే? యెట్ల వస్తిరే?
నా భయమైనా మీకు
మతిలోనఁ దోఁచకపోయెనా? చులుకనాయెనా?
అయితే చూచే! రారే! పో!
మితిలేని రచ్చకు వెఱతునా? రంతుఁ జేతునా?
మంచి, దిప్పు డిదేమీ? యువిదలార!
॥తెల్లవాఱనీ! ఊరుఁ జేరనీ!॥ ౧

ఏమే రాధా! బెదరించేవూ, ధిక్కరించేవూ
మా మదిలో సద్ద జేతుమా? హెచ్చు జూతుమా?
ఒక్కటంటేను పదా
తేమారకను తిట్టేవారమే! వెఱచి పారమే!
నీ గుట్టెంతైనా
మేము మునుపు వినుచుంటిమే! నేఁడు గంటిమే!
నీవు చూతువు గాని!
॥తెల్లవాఱనీ! ఊరుఁ జేరనీ!॥ ౨

---

* ఈ దరువునుండి "ఓసి! నాకక్కఱ లేదేమే?"- అనే దరువువరకు రాధకు, గోపికలకు జరిగిన వాగ్వాదము వర్ణితమైనది.
40. యీ రీతి యీ వేళ - క.

ఓహోహో! మీ బెదరింపులూ, చేసే రంపులూ
నేఁడు విన్నంతలోనె
ఆహాహా! నా గుండె లదరెనే! యెంత బెదరెనే!
యిఁక వెఱచీ, నే భోగి
గేహములోనైనా దాఁగేనే! ప్రాణ మాగేనే!
మీకు తరిగొండ నగరా
శ్రీహరి కైవసమాయెనే! యేమి సేయనే?
యెవ్వ రెట్లయ్యేమో? హో!
॥తెల్లవాఱనీ! ఊరుఁ జేరనీ!॥ ౩

## దరువు - అట తాళం

ఇది యేమె? రాధ! నీ-వింతైన నీ నీతి
మదిలోనఁ దెలియని - మాటలాడేవు ౧

అది యేమొ తెలుపరె! - యా నీతులైనాను
విదితముగా నేను - విని తెలిసేనే! ౨

మావలెనే నీవు - మగనాలవై యుండి
యీ విధమునఁ బల్కె - దేమి సాధకమే? ౩

నా మగనీ నేను - నాఁడే విడిచిపెట్టి
యీ మగనీఁ గూడి - తిఁక నాకు నదురేమే? ౪

ఎట్టైన నదురు నీ - కేల లేకాపోవు?
బొట్టు గట్టినట్టి - పురుషుఁ డుండఁగనూ ౫
బొట్టు గట్టినవానిఁ - బొమ్మని, హరి నేఁ జే
పట్టినాను, నాకు - భయము లింకేమే? ౬

నీకే భయములేక - నిలిచి మాటాడితే
మాకూను భయమింక - మదిలోను లేదే! ౭

నా కేమి భయమే? యా - నాటినుండి న
న్నీ కలికి గోపాలుఁ - డేలుకొన్నాఁడే! ౮

ఆనాఁడు నిన్నేలి - నట్టి గోపాలుఁడే
యీ నాటికిని మ - మ్మేలే నన్నాఁడే! ౯

మీ మగ లెప్పుడును - మీ వద్ద నుండఁగ
యీ మాధవుఁడు మి - మ్మేలే దేలాగే? ౧౦

అది యేమొ తరిగొండ - హరికిఁ దెలియును గాని,
యిది నీవు తర్కించే - దెందుకు? పోవే! ౧౧

## దరువు - [41]ఆది తాళం

ఓసి! నా కక్కఱ - లేదేమే?, ఛీ! ఛీ!
ఓసి! మా లోకము - నీ కేమే? ౧

నోరు దెలిసి మాట - లాడరే!, యిట్లు
మీఱితే నీ హెచ్చుఁ - జూడరే! ౨

చూడకుంటె యిండ్ల - కేఁగరే!, నిన్నుఁ
జూచి వెఱచుకొని - లోఁగరే! ౩

అపకీర్తికైనాను - వెఱవరే!, మ
మ్మపకీర్తినిఁ జే-సే వారెవ్వరే? ౪

41. అట తాళం -క.

అయితే, మీ రి - ల్లాండ్లు గారేమే?
నీ, కన్నాను మంచి - యిల్లాండ్లమే! ౫

మిమ్మిట్ల బసవులాఁ - జేసిరే!, వోసి!
మీ వారు నినుముద్ర - వేసిరే! ౬

వదరితే దెబ్బలు - దగిలినే!, వోసి!
పదరితే చెంపలు - పగిలినే! ౭

ఇంత చనవు కృష్ణుఁ - డిచ్చెనా?, నీచే
ఈ మాట లతఁడని - పించెనా? ౮

అడుగరే! తరిగొండ - ధామునీ, నీ
వడుగవే! మాకేల? - భామినీ! ౯

## ✳ మాయిక రాధకు సహాయముగా వచ్చుట ✳

వ. అని యిట్లు గోపకాంతలు, రాధ విడఁబడి కలహింపుచున్న సమయంబున, మాయిక రాధకు సహాయంబుగా వచ్చి, గోపకాంతలఁ జూచి యిట్లనుచున్నది: 138

## దరువు

ఓహోహో! కుయ్యక యింక - నూరకుండరే!
సాహసాము లీవేళకుఁ - జాలు! నిలుపరే! ౧

ఎవ్వరైనా వింటే వచ్చి - నవ్విపోయ్యేరే! మీరు
క్రొవ్వి రాధతోను నేఁడు - కొట్లాడకురే! ౨

రచ్చకైన భయములేక - వచ్చే మనేరే! యిట్ల
ముచ్చుల కుండేదైతేను - మూరెడు నోరే! ౩

వ. అని యిట్లు రోషంబు లాడిన మాయికను జూచి గోపాంగనలు తమలోఁ దామిట్లనుచున్నారు: 139

## ✳ గోపికలు మాయికను చెట్టుకుఁ గట్టివేయుట - రాధ విడిపించుట ✳

### దరువు - ఆది తాళం

మగువలార! రాధకొఱకు - మాయిక కొట్లాడవచ్చె
పగ సాధింప దీనినైనఁ - బట్టుకుందామే! ౧

గుట్టు గుట్టుగ దానికి - చుట్టమురాలైనావని
పట్టుకొని మాని మొదటఁ - గట్టి వేతామే! - ౨

అదిగో! తారిగొండ నరహ - రిందె చూచుచుండఁగాను
విదితముగా దీనిఁబట్టి - వెళ్లఁగొట్టుదామే! ౩

వ. అని పలికి, మాయికను బట్టి కట్టి కొట్టుచున్న సమయంబున, వెఱపులేక వెఱచిన చందంబున మాయిక రాధను జూచి యిట్లను చున్నది: 140

### దరువు - అట తాళం

ఓ రాధా! విడిపింపవే! ॥పల్లవి॥
అయ్యయ్యో! ఓ రాధా! విడిపింపవే! ॥ఉపపల్లవి॥

గయ్యాళు లిప్పు డొచ్చి - కట్టివేసి, నన్ను
కుయ్యో! మొఱ్ఱో! అన్నఁ - గొట్టుచున్నారే! ॥వో రాధా!॥ ౧

నక్కజోగినిఁ బాసి - దిక్కులేక వచ్చి
ఇక్కడ వీరిచేఁ - జిక్కితిఁ గదవే! ॥వో రాధా!॥ ౨

కూహకత్వము మాని - కుదురైన తరిగొండ
శ్రీహరితోనైనఁ జెప్పి - యీ వేళా ॥వో రాధా!॥ ౩

వ. అని యిట్లు పలికిన దీనవాక్యంబులు విని, రాధ గోపకాంతల ధిక్కరించి మాయికను విడిపించుకొని వచ్చి, హరినిఁ జూచి యిట్లనుచున్నది: 141

## ఏలలు

ఏరా? మాకూ లేనీపోనీ - పోరాటామూ దెచ్చి పెట్టి
యూరకే చూచుచున్నావూ, గోపాల బాలా!
-ఉత్తరామేమైనాఁ జెప్పావూ ౧

ఉత్తరాముఁ జెప్పేఁగానీ - యుచితామనుచు నామాట
మత్తేభయానా! వినేవేమే? వో కలికి రాధా!
-మనసు మోదాముఁ జేసేవేమే? ౨

ఏమీ యుత్తరాముఁ జెప్పే? - వేమీ నీకు సంతోషాము?
శ్యామావర్ణా! యిపుడె దెలుపారా! గోపాలబాలా!
-సమ్మతామైతే వినేను రా! ౩

మీరూ వారూ వొద్దికాను - మెలఁగుచుంటిరైనాను
నీరజాక్షీ! నాకు మోదమే! వో కలికి రాధా!
-నేను జెప్పే దీవుత్తరామే! ౪

తరిగొండవాసా! నీకింత - [42]దయ వుంటె, వీరినె కూడీ
ఇరవుగా నీ విందే యుండరా! గోపాలబాలా!
-యేను మందకుఁ బొయ్యేనురా! ౫

42. దయఁ బుట్టె - క.

## ✳ శ్రీకృష్ణుఁడు రాధను సమ్మతింపఁ జేయుట ✳

వ. అని పలికి యలిగిపోవుచున్న రాధ కడ్డంబుపోయి, హరి యిట్లను చున్నాఁడు: 142

ద్విపద. జలజాక్షి! నామీఁద – ఛలము సాధించి
పొలఁతి! నీ విట్లల్గి – పోవ నేమిటికి?
ఈ పగిదినిఁ బల్మ – తేఁచ నేమిటికి?
గోపకాంతలమీఁదఁ – గోప మేమిటికి?
రాకేందుముఖి కిన్ని – రంతు లేమిటికి?
నీ కేమి తక్కువ – నేను చేసితిని?
ఇన్నాళ్లపలెనె ని – న్నేలక మఱచి
యున్న నామీఁదఁ ద – ప్పుంచుదు గాని,
ముప్పిరిగొన్న నా – మోహ మీ వేళఁ
దప్పించి [43]పోవుట – ధర్మంబు గాదు
వలనొప్ప నన్నుఁగా – వలచితివేనిఁ
జెలుల నొల్లను, వేగఁ – జేపట్టు రాధ!

(వ. అనిన విని రాధ యిట్లనుచున్నది:) 143

ద్విపద. విను కృష్ణ! నీ కీర్తి – విశ్వంబునందు
ఘనమంచుఁ బొగడు స – త్కవివరులెల్ల
మగనాండ్లఁ బట్టె నీ – మాధవుఁ డనుచు
నగుఁబాటుఁ జేతురు – నానా విధముల
నీ కీర్తి నా కీర్తి, – నీ యపకీర్తి
నాకె కదా? యని – నా మానసమునఁ
జింత పుట్టిన, దేమి – సేయుదు నిప్పు?

43. పోయేది – క.

డింత కార్యము నందుఁ - దెఱిఁగినఁగాని
యేమనును? యశోద - యేమను? రాముఁ
డేమను? మందవా - రేమందు? రైన
నొక్కొక్క కామిని - నొక్కొక్క పురుషుఁ
డక్కఱతోఁ గూడు - టది విహితంబు.
నీ విట్లు మతిలేని - నెలఁతల కోర్కె
లే విధంబునఁ దీర్తు? - విది చిత్ర! మరయ
దూర మాలోచించు, - దుడుకులు మాను!
భారబుద్ధి వహించు - బాలగోపాల!

వ. అనిన విని, హరి నవ్వుచు నిట్లనుచున్నాడు: 144

తే.గీ. అతివ! నీ కిది సమ్మతమైనఁ జాలు
నిఖిలకార్యములను నేనె నిగ్రహింతు;
మనుజమాత్రుఁడఁగాను, చిన్మయుఁడఁగాని,
చింతసేయకు మిందుకై చిగురుఁబోణి! **145**

వ. అనిన విని, రాధ యిట్లనుచున్నది: 146

జంపె

ముద్దుగోపాల! యీ - ముగ్ధలను గోరితివి
వద్దనిన విడుతువా? - వట్టి భ్రమగాని, ౧

సామి! నీ మదికిఁ దోఁ- చని నీతు లిఁకను లే,
వేమిఁకను జెప్పుదును? - ఇభరాజ వరద! ౨

నీకు సమ్మతమైన - దే కార్యమైన మతి
నాకు సమ్మతి గాదె! - నళినాయతాక్ష! ౩

వ. అని యిట్లు రాధ సమ్మతించిన, హరి సంతసించి గోపకాంతలఁ బిలిచి రాధ కొప్పించిన, వారినిఁ జూచి రాధ యిట్లనుచున్నది: 147

## ✳ రాధ-గోపకాంతలు పరస్పరము సమాధానము నొందుట ✳

ఆ.వె. కాంతలార! నేను కమలలోచనుఁ జూచి
యీ విధమున మిమ్ముఁ బ్రోవవలసె;
మీర లిఁక మదించి మించి రెట్టింపక
నా యనుజ్ఞలోనె నడువవలయు. **148**

(వ. అనిన విని, గోపాంగన లిట్లనుచున్నారు:) 149

ఉ. ఇంచుక శాంతిలేక మము నెగ్గులు పల్కితి గాన, మేము ని
న్నెంచక మాటలాడితిమి; యింతియె కాని చలంబు లేదు, నీ
మంచితనంబు గావలసి మాధవుఁ జేరఁగ వచ్చినాము; మా
కంచితమైన యుక్తి నొక యాజ్ఞ నిరూపణచేయు రాధికా! **150**

వ. అనిన, రాధ మాయికను బిలిచి 'మాకు నొక్క నియమంబుఁ జేయు' మనిన విని, మాయిక గోపాంగనలఁజూచి యిట్లనుచున్నది: 151

## ✳ మాయిక యేర్పఱచిన నియమము ✳

ఆ.వె. ఒక్కనాఁడు రాధ, యొకనాఁడు మీరిందు
వచ్చి హరినిఁ బొందవలయుఁగాని,
అనుదినంబు వత్తు మనుచుఁ దలంపక
నా యనుజ్ఞలోను నడువరమ్మ! **152**

వ. అని యిట్లు మాయిక చేసిన నియమంబునకు గోపకాంతలు, రాధ సమ్మతించి; రంత హరి సంతసించి, కామిగాక యుండి, కామాతురుని చందంబున రాధను జూచి యిట్లనుచున్నాడు: 153

### దరువు - ఆది తాళం, నాలుగవ కాలం

రాధా! నా వయ్యారి రాధా! ॥పల్లవి॥

రాధా! నీ వను - రాగముతోను, ప
యోధర కలశము - లురమునఁ జేర్చవె! ॥రాధా!॥ ఉపపల్లవి॥

మొలకనవ్వులను- బలుకుచు, గులుకుచు
నలుక విడిచి యధ - రామృత మియ్యవె! ॥రాధా!॥ ౧

మఱి మఱి చుఱుకుగ - నరవిరి ములుకులు
తఱచుగ నాటెను - తాళఁజాలనే! ॥రాధా!॥ ౨

వరతరిగొండ నృ - హరి! రమ్మని స
త్కరుణతోను బిగి - కౌఁగిలియ్యవే! ॥రాధా!॥ ౩

క. అని యివ్విధమున రాధిక
మనమది రమ్యంబుఁ జేసి, మనసిజకేళిన్
పెనఁగొని, పిమ్మట గోపాంగనలను
లాలించి పలికె ఘనుఁడిట్లనుచున్: 154

### దరువు-ఆది తాళం, రెండవ కాలం

సమ్మతమాయెనే! ముద్దు - గుమ్మలారా! రాధ
మిమ్ము మన్నించెను లేరే! - కొమ్మలారా! ౧

మోవి తేనియ లియ్యరే! వో - ముదితలారా! వేగ
భావజుకేళికి రారే! - భామలారా! ౨

తరిగొండ నగరములోను - తరుణులారా! మి
మ్మిరవుగాఁ గూడియుండేనే! - యింతులారా! ౩

క. అని యిటువలె లాలింపుచు
కనకాంబరధరుఁడు గోపకాంతామణులన్
మనసిజకేళినిఁ దేలిచె
ననిమిషు లది చూచి మింట నచ్చెరువందన్. 155

వ. ఇవ్విధంబున లీలావినోదుండైన హరికి దృష్టి తాఁకునో యని తలంచి, రాధ యారాత్రికంబులు గైకొని మంగళంబుఁ బాడే విధం బెటువలెను. 156

## ✳ రాధ శ్రీకృష్ణునకు మంగళహారతి యొసంగుట ✳

### మంగళహారతి దరువు - అట తాళం

మాధవాయ జయ - మంగళమ్ ॥పల్లవి॥
పురుషోత్తమాయ..................మంగళమ్ ॥ఉపపల్లవి॥

విధినుత చరణాయ - వేదోద్ధరణాయ
మధుదైత్య హరణాయ - మంగళమ్ ॥మాధవాయ॥ ౧

బుధజనమిత్రాయ - భూమికళత్రాయ
మధురభాషణాయ శ్రీమహిజాకళత్రాయ మంగళమ్
॥మాధవాయ॥ ౨

మందరోద్ధారాయ - మంగళం, విమల
కుందాళి రదనాయ - గురుతర తరిగొండ
మందిరాయ శుభ - మంగళమ్ ॥శ్రీమాధవాయ॥ ౩

క. అని యివ్విధమున రాధిక
యనువందఁగ నారతిచ్చె, నంతట వేడ్కన్
వనజదళాక్షుఁడు వనితా
జనములతోఁ గూడియుండె సంతసలీలన్. 157

## ✳ కృతి సమర్పణము ✳

ద్విపద. అని యిట్లు నిఖిలలో - కాధీశుఁడైన
కనకాంబరునిపేరఁ - గరమర్థితోను
దేశికపదభక్తి - ధీరుఁడై చాల
వాసి కెక్కిన నంద - వరకులోద్భవుఁడు
సృష్టిపై వెలయు వా - సిష్ఠ గోత్రుండు
శిష్ట మానసుఁడు, దు - శ్శీలవర్జితుఁడు
వలనొప్పఁ గానాల - వంశ భూషణుఁడు
సలలితహృదయుండు - సద్బ్రహ్మవేత్త
యైన కృష్ణార్యున - కనుకూలయైన
మానినీమణి మంగ - మాంబికాతనయ
గురుతరంబుగఁ దరి - గొండ నృసింహు
వరలాభముననుసు, సు - బ్రహ్మణ్యయోగి
కరుణాకటాక్ష వీ - క్షణ మహత్త్వమున
నరులెన్న శ్రీ కృష్ణ - నాటకంబనెడు
వరకృతిఁ గావించి - వాసుదేవునకుఁ
బరమభక్తిని సమ - ర్పణముగాఁ జేసె

భూచక్రమున నిట్టి - పుణ్య ప్రబంధ
మాచంద్ర తారార్క - మై యొప్పుఁగాత!



శ్రీకృష్ణార్పణమస్తు. మంగళమహా శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ జేయును.

వికారినామ సంవత్సర జ్యేష్ఠ శు. ౧౩ లు వరకు బాలకృష్ణనాటకం సంపూర్ణమ్.

చీనేపల్లె పెద్దన్న కొమారుడు చంద్రప్ప వ్రాశిన బాలకృష్ణనాటకం.

T.T.D. "SVETA" Religious Publication Series No. 2



## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## శ్రీ వేంకటేశ్వర ప్రాణదాన ట్రస్టు, తిరుపతి.

(రిజిష్టరు నెంబరు: 75/2001)



తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారు దయాసముద్రుడు. ఆర్తులపై ఆపదలో వున్నవారిపై ఆయన చూపించే కరుణ అపారం, అనన్య సామాన్యం, అనారోగ్యంతో అల్లాడుతున్న వారికి ఆయనే ఒక దివ్య ఔషధం. దయా స్వరూపుడైన శ్రీ శ్రీనివాసుని దయతో తిరుమల తిరుపతి దేవస్థానం పేదలకై ఎన్నో ఆసుపత్రులను, ధార్మిక సంస్థలను నెలకొల్పింది, మానవసేవయే మాధవసేవ అన్న పరమార్థంతో కుల, మత, వర్ణాతీతంగా ప్రాణాంతక వ్యాధులతో బాధపడుతున్న పేదలైన రోగులకు సహాయం అందించేందుకు ఈ పథకంతో దేవస్థానం ముందుకు వచ్చింది.

ఆశయాలు: శ్రీ వేంకటేశ్వర ప్రాణదాన ట్రస్టు రోగగ్రస్తులైన పేదలకు సహాయం అందిస్తుంది. ఇది లాభాపేక్షలేని ధార్మిక సంస్థ. దీని రిజిష్టరు కార్యాలయం ఆంధ్రరాష్ట్రంలోని తిరుపతిలో వుంది. గుండె, మెదడు, మూత్రపిండాల వ్యాధులు, క్యాన్సర్లతో బాధపడే పేదవారికి ఉచితంగా వైద్య సహాయం అందించడం ఈ పథకం ప్రధాన ఉద్దేశ్యం. అత్యధికంగా వ్యయం అయ్యే ఈ వ్యాధుల చికిత్స ఖరీదును పేదవారు భరించలేరు. అందుకే కుల మతాతీతంగా వారి ప్రాణాన్ని నిలబెట్టేందుకు వారి చికిత్సకు అయ్యే వ్యయాన్ని ఈ పథకం ద్వారా అందిస్తారు. వారికి దేవస్థానం నిర్వహిస్తున్న స్విమ్స్, బర్డ్, రుయా, ప్రసూతి ఆసుపత్రులలో చికిత్స చేస్తారు. క్యాన్సరు మొదలైన ప్రాణాంతక వ్యాధుల నివారణకు జరిపే పరిశోధనలకు కూడా ఈ పథకం సహాయం చేస్తుంది. రక్తనిధి, కృత్రిమ అవయవాలు, ఫిజియోథెరపి, పరికరాలు, తదితరాలు పేదలకు ఉచితంగా అందేలా ఈ పథకం సహాయం పడుతుంది.

దేవస్థానం విరాళం ఈ ట్రస్టు స్వయంప్రతిపత్తి సంపాదించేందుకుగాను, ట్రస్టుకు విరాళంగా లభించిన మొత్తానికి సమానమైన మొత్తం దేవస్థానం ఇస్తుంది. సేవాభావంతో ప్రజలు విరివిగా ఈ పథకానికి విరాళాలు అందించాలి. విరాళం మొత్తం ఎంత అనికాక పేదల ప్రాణంనిలబెట్టాలనే దృక్పథంతో అందరూ ముందుకు రావాలి.

దాతలకు సౌకర్యాలు : ఈ ట్రస్టుకు 5 లక్షలు లేదా అంతకన్న ఎక్కువ విరాళంగా ఇచ్చినదాతలకు ఈ క్రింది సౌకర్యాలు లభిస్తాయి. సం॥లో 3 రోజులు దాత, అతని కుటుంబసభ్యులకు (5 గురికి మించకుండ) వైకుంఠం సెల్లారు ద్వారా వి.ఐ.పి. దర్శనం. మొదటిసారి దర్శనానికి వచ్చినపుడు శ్రీవారి, శ్రీపద్మావతి అమ్మవారి బంగారు పూత పూసిన వెండి డాలరు బహూకరణ. సంవత్సరానికి ఒకసారి దాతకు ఉత్తరీయం బహూకరణ. 3 రోజులు పాటు తిరుమలలో ఉచిత వసతి లేదా వి.ఐ.పి. అతిథి గృహాల్లో చెల్లింపుతో వసతి. ఈ సౌకర్యాలు దాతకు జీవిత పర్యంతము - ఫర్ములు, కంపెనీలు, ఇద్దరు దాతలు అయితే 20 సం॥లు వుంటాయి.

ఆదాయపు పన్ను రాయితీ: ఈ పథకానికి ఇచ్చే విరాళాలకు సెక్షన్ 35 ఎసి క్రింద ఆదాయపు పన్ను రాయితీ లభిస్తుంది.

విన్నపం వదాన్యులు, మానవతావాదులు, శ్రీ వేంకటేశ్వర ప్రాణదాన ట్రస్టుకు విరివిగా విరాళాలు ఇవ్వాలని విజ్ఞప్తి చేస్తున్నాం. మీరు చేసే సహాయం ప్రాణాంతక వ్యాధులతో బాధపడే పేదవారికి ప్రాణదానం చేస్తుంది. మీ దానంవల్ల వైద్య సహాయం అంది పేదవారి జీవితంలోను, కుటుంబంలోను చిరునవ్వుల పూలు పూస్తాయి

మీ విరాళాలను ఏ జాతీయ బ్యాంకు నుంచైనా "కార్యనిర్వహణాధికారి, తి.తి. దేవస్థానం, శ్రీ వేంకటేశ్వర ప్రాణదాన ట్రస్టు, తిరుపతి" పేర తీసుకుని "కార్యనిర్వహణాధికారి, టి.టి.దేవస్థానం, టి.టి.డి. పరిపాలనా భవనం, కె.టి.రోడ్డు, తిరుపతి" వారికి పంపాలి. ఇతర వివరాలకు : పౌరసంబంధాధికారి, ఫోన్ నెం: 0877-2264677 లేదా ఛీఫ్ అకౌంట్స్ ఆఫీసర్- ఫోన్ నెం: 0877-2264752 తి.తి.దేవస్థానములు, తిరుపతి వారిని సంప్రదించండి. e-mail: webmaster@tirumala.org

**విరివిగా విరాళాలు ఇవ్వండి! పేదలకు ప్రాణదానం చేయండి!!**

Published by Sri A.P.V.N. Sarma, I.A.S., Executive Officer
T.T.Devasthanams and Printed at Sri Parasaraya Press, Sri Vyasasramam.